# సోవియట్

## రష్యా ★ చైనా

# రాజ్యాంగాలు

—:( అనువాదం ):—

విషమూర్తి. అశ్వినీకుమార దత్తు,
విషమూర్తి. ఉమారాజేశ్వరరావు.

ప్రగతి ప్రచురణాలయం.

B

# INTRODUCTION.

This book is a faithful rendering in easy Telugu of the constitution of the U. S. S R. from what it was in 1924 to what it has been developed into to-day. The Author Sri A. K. Dutt is no stranger to the task. He has many publications to his credit; and is one who has made a close and intimate study of Russian Socialism from every angle of approach.

India has atlast come to be recognised as a nation in the political world. Now, what will be the constitution that the Country will forge for its political existence, all round prosperity and progress? That indeed is primary consideration and of vital concern to every thinking Indian.

This book has not come a minute too soon. The Russian constitution is undoubtedly one which aims to found the maximum rights of citizenship of the individual. In fact it is claimed by the Russians themselves that their constitution has achieved it.

The author therefore deserves all commendation for the thoughtful move and the book deserves every attention from the Telugu reading public for which it is intended at the right moment.

CUDDAPAH. }
11—12—47 }

[Sd.] S. KRISHNA SWAMY,
Barrister-at-law

# ముందుమాట.

సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో సోషలిజం సాధించిన మహత్తర విజయాలు పొందిన రూపాలే యీసోషలిస్టు రాజ్యాంగ శాసనాలు. యుగయుగాలుగా మానవజాతి కనిన బంగారు కలలు గాలిమేడలు కావనీ, ఆచరణసాధ్యమైన వేనని సోవియట్‌రష్యాలో ఋజువుచేయబడి ధనికప్రజాస్వామిక, వలసబానిస దేశాల అభ్యుదయకాముకులకు యీరాజ్యాంగాలు అనుసరణీయమైన కార్యక్రమాలుగా రూపొందాయి.

సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామిక రాజ్యాంగంలోని విశిష్టలక్షణాలు సూచీమాత్రంగా యీక్రింద పొందుపరుస్తున్నాము.

1. నేడు సోవియట్ రష్యాలో ఆచరణలోనున్న "ప్రతివానినుండీ అతనిశక్తి సామర్థ్యములనుబట్టి, ప్రతివానికీ అతనిపని పరిమాణమునుబట్టి" అనుప్రధాన సూత్రము పునాదిగాగల సోషలిస్టు వ్యవస్థకు శాసనరూపమే యీరాజ్యాంగం.

2. భూమి, అడవులు, యంత్రాగారాలు, గనులు, తదితర ఉత్పత్తిసాధనాల, శక్తులయొక్క సామూదాయకస్వత్వము; పీడిత, పీడక వర్గవిభేద, నిరుద్యోగ నిర్మూలనము; పనిచేయుట సమర్థుడైన ప్రతిపౌరుని విధ్యుక్త ధర్మము అనుపునాదులపై యీరాజ్యాంగం నిర్మింపబడింది.

3. జాతి, తెగవిభేదాలను రూపుమాపి సమానస్వాయం నిర్ణయహక్కులు పునాదిగాగల అంతర్జాతీయతను పెంపొందించుట.

4. తరగతుల, వర్గముల నియంతృత్వ పరిపాలనను రద్దు చేసి పూర్ణప్రజాతంత్రాన్ని ఆచరణలో పెట్టుట.

5. ఈపైనుదహరించిన యావత్తు విశిష్టలక్షణములను సూత్రప్రాయముగా నిర్వచించుట మాత్రమే కాక ఆచరణసాధ్యము చేయుట యీ రాజ్యాంగలోని ప్రత్యేకత.

స్వతంత్ర ఇండియా సమ్మేళనంయొక్క రాజ్యాంగ నిర్మాణం కావింపబడుతూన్న యీశుభసమయంలో చైనాకమ్యూనిస్టు నేతయైన మోసీడంగు నిర్వచించిన నూత్నప్రజాస్వామిక సిద్ధాంతానుగుణ్యంగా చైనాసోవియట్ రాజ్యాంగాన్నీ, రష్యాసోవియట్ రాజ్యాంగాన్నీ అతిశ్రద్ధతో అభ్యసించవలసియున్నది. పై ఉద్దేశంతోనే యీపుస్తకం ప్రచురిస్తున్నాము.

కడప
20—12—47

ఇట్లు,
అనువాదకులు.



అధ్యాయం 1



# సమాజ నిర్మాణం

—— (o) ——

నిబంధన. 1—సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామిక సమ్మేళనము కార్మిక, కర్షక సోషలిస్టు రాజ్యాంగము.

నిబంధన 2—భూస్వాములను, పెట్టుబడిదార్లను కూలద్రోసి, శ్రామికవర్గ నియంతృత్వ స్థాపనవలన వ్యాపించి బలపడిన కార్మిక ప్రతినిధుల సోవియట్లు, సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామిక సమ్మేళనము యొక్క రాజకీయ పునాదిగా నుండును.

నిబంధన. 3—సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామిక సమ్మేళనములో సమస్తాధికారములు నగర, గ్రామ కార్మికుల ప్రతినిధి సంస్థలైన కార్మిక ప్రతినిధుల సోవియట్లను చెందును.

నిబంధన 4—పెట్టుబడిదారీ సమాజపు ఆర్థిక వ్యవస్థను రద్దుచేసి ఉత్పత్తిసాధన శక్తుల వ్యక్తిగత స్వత్వములను తుడిచివేసి మానవుని తోడిమానవుడు దోచుకునే అవకాశములను నిర్మూలించి, వాటిస్థానే సుస్థిరంగా నెలకొల్పిన సోషలిష్టు ఆర్థికవ్యవస్థ, ఉత్పత్తిశక్తి, పరికరముల సంఘస్వత్వములు సో.సో. ప్ర. సమ్మేళనం యొక్క ఆర్థిక పునాదిగా చేయుబడినవి.

నిబంధన 5 — సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామిక పరిశ్రమలలోని సోషలిస్టు ఆస్థి ప్రభుత్వాస్థి (సర్వప్రజా స్వత్వము) రూపంలోగాని, సహకార సమిష్టిక్షేత్రముల (సమిష్టిక్షేత్రపు ఆస్థిగానో, సహకార సంఘపుటాస్థిగానో) ఆస్థిరూపంలోనో వుంటుంది.

నిబంధన 6. యావత్తు భూమి, నిధులు, నిక్షేపములు, నదులు, సరస్సులు, అడవులు, పరిశ్రమలు, యంత్రాగారములు, గనులు, రైల్వే, జల, వాయు యానమార్గములు, బ్యాంకులు, పోస్టు, టెలిగ్రాఫ్, టెలిఫోనులు, ప్రభుత్వనిర్మిత విశాల వ్యవసాయక్షేత్రములు (ప్రభుత్వక్షేత్రములు. యంత్ర, మరనాగలి (ట్రాక్టరు స్టేషన్లు మొదలైనవి), మ్యునిసిపలు నిర్మాణములు, పట్టణములలోని, కార్మిక నివాసప్రాంతములలోని గృహాములలో అధికభాగము ప్రభుత్వ ఆస్థి, అనగా, సర్వప్రజలకు చెందిన ఆస్తి.

నిబంధన 7. ప్రజాఉద్యమాలచే నడిపించబడే సమిష్టి వ్యవసాయక్షేత్రములు, సహకార సంస్థలు, వాటికి చెందినపశువులు, గుర్రములు, పనిముట్లు, వాటివలన లభించు ఫలసాయము, సామగ్రులు, వాటికి ఉమ్మడిగాచెందిన భవనములుసమిష్టి వ్యవసాయక్షేత్రములకు, సహకార సంస్థలకు, ఉమ్మడిగాను సోషలిస్టు ఆస్థిగాను ఏర్పాటు చేయబడినది. సమిష్టి వ్యవసాయ

క్షేత్రమునకు చెందిన ప్రతికుటుంబమునకు దాని మీదవచ్చు ప్రాథమిక ఆదాయమునకు తోడుగా కుటుంబమువారు నివసించు స్థలమునకు చేర్చి—కోళ్ల పెంపకమునకు కూరగాయలు పండించుకొనుటకు పశుపోషణకు గొడ్లసాలకు తగినంత స్థలమును వ్యవసాయ సంఘపట్టు నిబంధనల ననుసరించి ప్రత్యేకపుటాస్తిగా ఉపయోగించుకొనవచ్చును.

నిబంధన 8. సమిష్టి వ్యవసాయక్షేత్రములచే ఆక్రమించబడిన భూములు వాటి ఉపయోగము నిమిత్తమై ఖరీదు లేకగాక ఉచితముగా శాశ్వతముగా నిచ్చివేయబడినవి.

నిబంధన 9. సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామిక సమ్మేళనంలో ప్రబలంగావున్న సోషలిస్టు ఆర్థిక విధానం తోపాటు యితరుల శ్రమశక్తి ఫలితమును దోచుకోకుండా స్వయంకృషిపైన ఆధారపడు వ్యక్తిగత రైతులు, గృహపారిశ్రామికుల యొక్క ఆర్థికవిధానమును కొనసాగించుటకు చట్టము సమ్మతిస్తుంది.

నిబంధన 10. పౌరులు చేయు పనులవలన లభించు ఆదాయములు వారి నిల్వలు నివాసగృహములు గృహావసరకములు గృహోపకరణములు వంటపాత్రలపైగల పౌరుల వ్యక్తిగత స్వత్వపు హక్కును వ్యక్తిగత ఆస్తిపై పౌరులకుగల వంశపారంపర్యపు హక్కులును చట్టరక్షితములు.

నిబంధన 11. ప్రజాసంపదను వృద్ధిపరచుట, కార్మిక ప్రజానీకంయొక్క ఆర్థిక, సాంస్కృతిక పరిస్థితుల నభివృద్ధిపరచుట, సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క స్వాతంత్ర్య ఆత్మరక్షణ సామర్థ్యములను పటిష్టమొనర్చి వృద్ధిపరచు లక్ష్యములో ప్రభుత్వ జాతీయ ఆర్థికపథకము సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క ఆర్థికజీవితాన్ని నిర్ణయించి నడుపుతుంది.

నిబంధన 12. సో. సో. ప్ర. సమ్మేళనంలో పనిచేయగల ప్రతిపౌరుడూ పనిచేయుట గౌరవప్రదమైన ధర్మ నిర్వహణగా పరిగణింపబడుతుంది: "పనిచేయనివాడు తిండి తినటానికి అనర్హుడు" అను సూత్రం అనుసరింపబడుతుంది.

సో. సో. ప్ర. సమ్మేళనంలో సోషలిస్టు సూత్రమైన "శక్తిసామర్థ్యముల ననుసరించి ప్రతి ఒక్కనినుండి. పనిబట్టి ప్రతిఒక్కనికీ" అనుసూత్రము అమలు జరుపబడుతుంది.

## అధ్యాయం 2

# రాజ్యాంగ నిర్మాణం

నిబంధన 13. సోవియటు సోషలిస్టు ప్రజాస్వామిక సమ్మేళనం సమాన హక్కులుగల సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికముల స్వచ్ఛందకలయికవలన యేర్పడిన మహారాష్ట్రకూటమి (ఫెడరల్ రాజ్యాంగము). ఈ ఫెడరేషన్‌లో జేరిన ప్రజాస్వామికములు:

| యుక్రేనియన్. | సోవియట్. | సోషలిస్టు. | ప్రజాస్వామిక |
|---|---|---|---|
| బైలోరష్యన్ | ... | ... | ... |
| అజెర్‌బైజాన్ | ... | ... | ... |
| జార్జియన్ | ... | ... | ... |
| ఆర్మీనియను | ... | ... | ... |
| టర్క్‌మెను | ... | ... | ... |
| ఉజ్‌బెక్ | ... | ... | ... |
| టజిక్ | ... | ... | ... |
| కిజఖ్ | ... | ... | ... |
| కిరిఘిజ్ | ... | ... | ... |
| కరీలో-ఫిన్నిష్ | ... | ... | ... |
| మోల్డేవియన్ | ... | ... | ... |
| లిథువేనియన్ | ... | ... | ... |
| లట్వియన్ | ... | ... | ... |
| ఎస్థోనియన్ | ... | ... | ... |

నిబంధన 14. సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క అధికార ఆవరణములోపడి ప్రభుత్వాంగములచే నడుపబడు అంశములు దిగువ పేర్కొనబడినవి.

(1) అంతర్జాతీయ సంబంధములను నిర్ణయించుట సమ్మేళనమునకు ప్రాతినిధ్యము వహించుట విదేశప్రభుత్వములతో సంధులు ఒడంబడికలు చేసికొనుట, ఆమోదించుట.

(2) శాంతి యుద్ధసమస్యలు.

(3) సో. సో. ప్ర. సమ్మేళనంలో నూతన ప్రజాస్వామికములను జేర్చుకొనుట.

(4) సో. సో. ప్ర. సమ్మేళనరాజ్యాంగ నిబంధనలన్నియు సరిగా అనుష్ఠింపబడునట్లు చూచుట, సమ్మేళనంలో చేరిన ప్రజాస్వామికముల రాజ్యాంగ చట్టములు, నిబంధనలు. సో. సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగచట్టమునకు, నిబంధనకు అనుసరించి యుండునట్లు, తద్విరుద్ధముగా నుండకుండునట్లును చూచుట.

(5) సమ్మేళన ప్రజాస్వామిక ప్రాంతీయసరిహద్దు మార్పులను ఆమోదించుట.

(6) సమ్మేళనంలో చేరిన ప్రజాస్వామిక దేశల్లో యేర్పడు కొత్త రాష్ట్రములు, ప్రాంతములను, నూతనస్వతంత్ర ప్రజాస్వామిక నిర్మాణములను ఆమోదించుట.

(7) సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క రక్షణకు దేర్పాటు చేయుట. సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క సాయుధ సైన్యములన్నింటిని నడిపించుట.

(8) యావత్తు విదేశవాణిజ్య, వ్యాపారములపై ప్రభుత్వం గుత్తాధికారము కలిగియుండుట.

(9) రాజ్యాంగమును సంరక్షించుట.

(10) సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క జాతీయార్థిక పథకములను రచించుట.

(11) సా. సా. ప్ర. సమ్మేళనంయొక్క, అందులో చేరిన ప్రజాస్వామిక ప్రభుత్వముయొక్క బడ్జెట్టును, పన్నులను, ప్రభుత్వాదాయములను ఆమోదించుట.

(12) బ్యాంకులు, పారిశ్రామిక, వ్యవసాయిక సంస్థల పాలన, సమ్మేళనమునకు చెందిన ప్రముఖవ్యాపార వాణిజ్య సంస్థల పాలన కొనసాగించుట.

(13) రహదారులను సక్రమముగ కొనసాగించుట.

(14) ద్రవ్య, పరపతివిధానములను నడుపుట.

(15) ప్రభుత్వ భీమాసంస్థల నిర్మాణము.

(16) అప్పులుచేయుట, అప్పులిచ్చుట.

(17) సాగుబడిభూమి, నిధులు, అడవులు, నీటివాడకము నకు సంబంధించిన సూత్రములనుచేయుట.

(18) విద్య, ప్రజారోగ్య రంగములకు సంబంధించిన ప్రాథమికసూత్రములను చేయుట.

(19) ఏకవిధమైన జాతీయ ఆర్థికవివర సంఖ్యాపట్టికలను తయారుచేయు నిర్మాణములను నెలకొల్పుట.

(20) కార్మిక శాసన నిర్మాణమునకు సంబంధించిన సూత్రీకరణం.

(21) న్యాయవిచారణ విధానము, న్యాయవిచారణ క్రమమునకు సంబంధించిన చట్టములను, సివిలు, క్రిమినలు కోడ్లను చేయుట.

(22) సమ్మేళన పౌరసత్వపట్టములు, విదేశ స్థలహక్కులు.

(23) సర్వసమ్మేళనము తరపున ప్రాతినిధ్యదానము చేయుట.

నిబంధన 15:—సో. సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగపట్టంలోని 14 నిబంధనలో కావింపబడిన ప్రభుత్వాధికారములను సమ్మేళన ప్రజారాజ్యములు కలిగియుంటాయి. ఈ ఏర్పాట్లకు లోబడకవుండు ప్రభుత్వాధికారములను ప్రతిరాజ్యమూ సర్వస్వతంత్రముగా చలాయించుకుంటుంది. సో. సో. ప్ర. సమ్మేళనము సమ్మేళన ప్రజారాజ్యముల ప్రభుత్వాధికారములను రక్షిస్తుంది.

నిబంధన 16:—ప్రతిసమ్మేళన ప్రజారాజ్యమును, దాని ప్రత్యేకావసరములకు సరిపడు రాజ్యాంగపట్టమును సో. సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగపట్టమునకు అనుకూల్యముగా వుండునట్లు నిర్మించవలెను.

నిబంధన 17:—ప్రతి సమ్మేళన ప్రజాస్వామికమునకు స్వేచ్ఛగా సమ్మేళనమునుండి విడిపోవు హక్కుగలదు.

నిబంధన 18:—ఏ సమ్మేళన ప్రజాస్వామికమునకు లోబడిన ప్రాంతమును, దాని అభీష్టమునకు వ్యతిరేకముగా మార్పు చేయబడదు.

నిబంధన 19:—సో. సో. ప్ర. సమ్మేళన శాసనములు సమ్మేళనంలో చేరిన ప్రజాస్వామికములన్నింటికిని సమముగా వర్తించును.

జ్యాయిపెకరాజే, ఆయిరాట్, ఖాకస్, చెర్కెస్, స్వాతంత్ర్య ప్రాంతములు.

నిబంధన 23:—యుక్రేనియన్ సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామికములో అక్కెర్మన్, విన్నిట్సా, వోల్హీనియా, వోరోషిలోవ్‌గ్రాడ్, నీప్రోపెట్రోవ్స్క్, డ్రోహొబిచ్, జిటోమిర్, జపోరోఝి, కామెనెట్స్-పొడోల్స్క్, కీవ్, కిరోవోగ్రాడ్, లోవ్, నికోలేవ్, ఒడెస్సా, పోల్టావా, రోవ్నో, స్టాలినో, స్టానిస్లావ్, సుమి, టార్నోపోల్, ఖార్కోవ్, చెర్నిగోవ్, చెర్నివిట్స్ ప్రాంతములు కలిసియున్నవి.

నిబంధన 24:—అజెర్‌బైజాన్ సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికంలో నఖిచేవాన్ స్వతంత్ర సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికము, నాగోర్నో-కారాబాఖ్ స్వతంత్ర రాష్ట్ర ప్రాంతములు చేరియున్నవి.

నిబంధన 25:—జార్జియన్ సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికములో అబ్‌ఖేజియన్ స్వతంత్ర సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికము, అడ్‌జార్ స్వతంత్ర సోషలిస్టు ప్రజాస్వామికము, దక్షిణ ఒస్సేషియన్ స్వతంత్ర రాష్ట్ర ప్రాంతము చేరియున్నవి.

నిబంధన 26—ఉజ్‌బెక్ సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికంలో బుఖారా, సామర్‌ఖండు, టాష్కెంటు, ఫెర్గానా, ఖోరెజమ్ ప్రాంతములున్ను, కారాకల్ప స్వతంత్ర సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికమును చేరియున్నవి.

నిబంధన 27:—టజిక్ సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికంలో గార్మ, కుల్యాబ్, లెనినాబాద్, స్టాలినాబాద్, గార్నోబదక్‌సాన్ స్వతంత్ర ప్రాంతములు చేరియున్నవి.

నిబంధన 28:—కజక్ సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికంలో అక్మోలింస్కు, అక్టుబింస్కు, అల్మాఅటా, తూర్పుకజఖ్‌స్థాన్, గురీవ్, జాంబుల్, పశ్చిమకజఖ్‌స్థాన్, కర్గాండా, జిల్‌వోర్డా, కుస్టానే, పాల్‌లోడార్, ఉత్తరకజఖ్‌స్థాన్, సెమిపలాటింస్కు, దక్షిణ కజఖ్‌స్థాన్ ప్రాంతములు కలిసియున్నవి.

నిబంధన 29:—బైలోరష్యన్ సోవియటు సోషలిస్టు, ప్రజాస్వామికంలో బారానోవిషి, బైలోస్టాక్, బ్రెస్టు, విలేకా, విటెబ్స్కు, గోమెల్, మింస్కు, మోగిలెవ్, పింస్కు, పోలిసీ ప్రాంతములు కలిసియున్నవి.

నిబంధన 29 (అ)—టర్కుమెన్ సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికం అష్కబాద్, క్రాస్నోవోడస్కు, మారీ, టాషౌజ్, చార్జా ప్రాంతములు కలిసి యేర్పడినది.

నిబంధన 29 (ఆ)—కిరిఘిజ్ సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికము జలాల్‌ఆబాద్, అసిక్‌కుల్, వోష్, టీన్‌షాన్ ఫుంజెంప్రాంతములతో యేర్పడినది.

—)o(—

# అధ్యాయం 3

## సో. సో. ప్ర. సమ్మేళన ప్రభుత్వంయొక్క అత్యున్నత పరిపాలనా శాఖలు

నిబంధన 30:—సో. సో. ప్ర. సమ్మేళన ప్రభుత్వంయొక్క అత్యున్నత పరిపాలనాశాఖ సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క సుప్రీమ్ సోవియటు.

నిబంధన 31:—సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క సుప్రీమ్ సోవియటు, రాజ్యాంగ శాసనంలోని 14-వ నిబంధన ననుసరించి సో. సో. ప్ర. సమ్మేళనమునకు సంక్రమించిన సమస్తాధికారమును చెలాయించును. సుప్రీమ్ సోవియటు పాలకవర్గము (ప్రెసిడియం) ప్రజాప్రతినిధి సలహాసంఘము, ప్రజాప్రతినిధివర్గములను పరిపాలకశాఖలు సుప్రీమ్ సోవియటుకు లోబడిన పరిపాలనశాఖలు.

నిబంధన 32:—సో. సో. ప్ర. సమ్మేళనం యొక్క శాసననిర్మాణాధికారముసంపూర్ణముగా సుప్రీమ్ సోవియట్ చేతనే చలాయించబడును.

నిబంధన 33:—సమ్మేళన సోవియట్, జాతుల సోవియటు అను రెండుసభలను సుప్రీమ్ సోవియటు కలిగియుండును.

నిబంధన 34:—సో. సో. ప్ర. సమ్మేళనంలోని మూడు లక్షలప్రజలు నివసించు నియోజక ప్రాంతములనుండి ఒక్కొక్కని చొప్పున ఎన్నుకొనబడిన ప్రతినిధులతో సోవియటు సమ్మేళనము ఏర్పడును.

నిబంధన 35:—జాతుల సామితుటు సా. సా. ప్ర. సమ్మేళన సాయలవలన యీ క్రిందివిధముగా యెన్నుకొనబడిన ప్రతినిధులతో యేర్పడును. ప్రతి సమ్మేళన ప్రజాస్వామికము నుండి 25 గురు ప్రతినిధుల చొప్పున, ప్రతిస్వపరిపాలక ప్రజాస్వామికమునుండి 11 గురు ప్రతినిధులచొప్పున, ప్రతిస్వపరిపాలక ప్రాంతమునుండి 5 గురు ప్రతినిధుల చొప్పున, ప్రతిజాతీయ ప్రాంతమునుండి ఒక్కొక్క ప్రతినిధి చొప్పున ప్రతినిధులు జాతుల సామితుటుకు యెన్నుకొనబడెదరు.

నిబంధన 36:—సుప్రీమ్ సామితుటు నాలుగుసంవత్సరములకొకపర్యాయము యెన్నుకొనబడును.

నిబంధన 37:—సుప్రీం సామితుటు యొక్క రెండు సభలైన సమ్మేళన సామితుటు, జాతుల సామితుటు రెండునూకూడ సమానహక్కులను కలిగియుండును.

నిబంధన 38:—సమ్మేళన, జాతులసామితుట్లు రెండింటికీ సమానమైన శాసనములను ప్రవేశపెట్టు అధికారములు గలవు.

నిబంధన 39:—సుప్రీం సామితుటుయొక్క రెండు సభలలోను అత్యధికసంఖ్యాకుల ఓట్లచే నెగ్గినపట్టనే శాసనము కావింపబడును.

నిబంధన 40:—సుప్రీం సామితుటుచేత చేయబడినశాసనములు సమ్మేళన ప్రజాస్వామికము లోని అన్ని దేశభాషలలోను సుప్రీం సామితుటుయొక్క పాలకవర్గపు అధ్యక్షకార్యదర్శుల సంతకములతో ప్రచురింపబడుచుండును.

నిబంధన 41:—సమ్మేళన సొసైయటు, జాతుల సొసైయటు సభాసమావేశములు ఏకకాలమందే ప్రారంభింపబడి ముగింపబడుచుండును.

నిబంధన 42:—సమ్మేళన సొసైయటు ఒక అధ్యక్షుని, యిద్దరు ఉపాధ్యక్షులను ఎన్నుకొనును.

నిబంధన 43:—జాతుల సొసైయటు ఒక అధ్యక్షుని, యిద్దరు ఉపాధ్యక్షులను యెన్నుకొనును.

నిబంధన 44:—సమ్మేళన జాతుల సొసైయట్ల అధ్యక్షులు ఆనభాసమావేశాలకు అధ్యక్షత వహించి సభాకార్యక్రమములను నడుపుచుందురు.

నిబంధన 45:—సా. సా ప్ర. సమ్మేళన సుప్రీం సొసైయటుయొక్క ఉభయశాసన సభల సమిష్టి సమావేశములకు సమ్మేళన జాతుల సొసైయట్ల అధ్యక్షులు ఒకరి తరువాత ఒకరు అధ్యక్షత వహించెదరు.

నిబంధన 46:—సుప్రీం సొసైయటు సమావేశములు సంవత్సరమునకు రెండుపర్యాయములు సుప్రీంసొసైయటి ప్రెసీడియంచే సమావేశపరచబడును.

ప్రెసీడియంయొక్క వివక్షణతోగాని, సమ్మేళన ప్రజాస్వామికముల కోరికపైగాని ప్రత్యేకసమావేశములు ప్రెసీడియంచేజరుపబడును.

నిబంధన 47:—సమ్మేళన, జాతుల సొసైయట్ల మధ్యవిభేదములు కలిగిన సందర్భములలో ఉభయసొసైయట్ల నుండి

సమానసంఖ్యగల సభ్యులచే ఏర్పాటు చేయబడిన సమాధాన సంఘముచే పరిష్కరింపబడును. సమాధాన సంఘము యేదైనా ఒడంబడికకు రాజాలకపోయినగాని, వారినిర్ణయము రెండు ఒక్క శాసనసభకు సంతృప్తి నీయకపోయినచోగాని ఆ ప్రశ్న రెండవపర్యాయము శాసనసభలచే పునర్విచారణ చేయబడును. ఉభయసభలమధ్య సమాధానము కుదరనిచో సుప్రీంసోవియట్‌ను ప్రెసిడియం రద్దుచేసి క్రొత్తయెన్నికలు జరుపును.

నిబంధన 48:—సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క సుప్రీంసోవియటు ఉభయశాసన సభల సమిష్టి సమావేశములో సుప్రీం సోవియటుయొక్క ప్రెసిడియంను (అధ్యక్షవర్గము) ఎన్నుకొనును. అందులో ఆ ప్రెసిడియంకు ఒకఅధ్యక్షుడు, 16 గురు ఉపాధ్యక్షులు, ఒకకార్యదర్శి, 24 గురు సభ్యులు వుందురు.

ప్రెసిడియం తానుచేయు కార్యములన్నింటికి సుప్రీం సోవియట్‌కు పూచీవహించును.

నిబంధన 49:—సుప్రీం సోవియట్‌యొక్క ప్రెసిడియం ఈ దిగువకార్యములను నిర్వహించును.

(అ) సుప్రీం సోవియట్‌యొక్క సమావేశములను జరుపును.

(ఆ) సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క అమలులోనున్న శాసనములకు వివరణముచేయును; ఆజ్ఞలనుజారీ చేయును,

(ఇ) సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క రాజ్యాంగవ

(ఎ) సంపూర్ణముగాగాని, కొంతభాగమునుగాని సైన్యములను సంసిద్ధపరచుటకు ఆజ్ఞాపించును.

(ఏ) అంతర్జాతీయ ఒడంబడికలను ఆమోదించును.

(ఐ) విదేశ ప్రభుత్వములకు సర్వాధికారములుగల రాయబారులను నియమించుటకును, తిరిగి పిలువనంపుటకును అధికారములను కలిగియుండును.

(ఒ) విదేశ ప్రభుత్వముల రాజకీయ శాఖా ప్రతినిధుల సాధికారయోగ్యతా పత్రములను, అధికారమును రద్దుచేసి తిరిగి పిలువనంపు ఉత్తరములను గ్రహించును.

(ఓ) ప్రజాశాంతి, ప్రభుత్వ భద్రతలకొరకును, సో. సో. ప్ర. సమ్మేళన రక్షణకొరకును, ప్రత్యేక ప్రదేశములలోగాని సో. సో. ప్ర. సమ్మేళనమంతటిలోగాని సైనిక శాసనము (మార్షల్ లా) ను ప్రకటించును.

నిబంధన 50:—సమ్మేళన సోవియట్, జాతుల సోవియటు ఆయా శాసనసభల ప్రతినిధుల సాధికారయోగ్యతా పత్రములను పరీక్షించు యోగ్యతా నిర్ణాయకసంఘములను యెన్నుకొనును.

యోగ్యతానిర్ణాయక సంఘముల సలహాననుసరించి శాసనసభలు ఆయా ప్రతినిధుల సాధికార యోగ్యతా పత్రములను ధృవపరచుటో, రద్దుచేయుటో నిర్ణయించును.

నిబంధన 51:—ఏవిషయములోనైనను అవసరమని తలచినప్పుడు సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క సుప్రీంసోవియ

ము పరీక్షించుటకు, పరిశోధించుటకు పరిశోధక సంస్థలను నియమించును.

ఈసంఘములు అవసరములను తీర్చుట, వారుకోరువస్తువులను పత్రములను వారివశము చేర్చుట అన్నిసంస్థలయొక్క, ప్రభుత్వ ఉద్యోగులయొక్క విధియైయున్నది.

నిబంధన 52:—ఏ సా. సా. ప్ర. సమ్మేళన సుప్రీం సొవియటు సభ్యునిపైనను, సా. సా. ప్ర. సమ్మేళనంయొక్క సుప్రీంసొవియటు అంగీకారము, సా. సా. ప్ర. సమ్మేళనం యొక్క సుప్రీంసొవియట్ సభల విరామకాలంలో సా. సా. ప్ర. సమ్మేళనంయొక్క సుప్రీంసొవియటు ప్రెసీడియం (అధ్యక్షవర్గపు) అనుమతిలేనిదేగాని నేరారోపణచేయుట, నిర్బంధించుట చేయరాదు.

నిబంధన 53:—సా. సా. ప్ర సమ్మేళనంయొక్క సుప్రీం సొవియట్ అధికార కాలపరిమితి అంతమునగాని, అధికార కాలపరిమితి పూర్తియగులోపునే సుప్రీంసొవియటు రద్దుచేయబడిన సందర్భములోగాని, నూతనముగా యెన్నుకోబడిన సా. సా. ప్ర. సమ్మేళనంయొక్క సుప్రీం సొవియటుచే నూతనఅధ్యక్షవర్గము (ప్రెసీడియం) యెన్నుకొనబడువరకు సా. సా. ప్ర. సమ్మేళనంయొక్క సుప్రీంసొవియటు పాతఅధ్యక్షవర్గమే అధికారములో నుండును.

నిబంధన 54:—సా. సా. ప్ర. సమ్మేళనంయొక్క, సుప్రీం సొవియట్ అధికార కాలపరిమితి అంతమునగాని, అధికార కాలపరిమితి పూర్తియగులోపునే సుప్రీం సొవియటు

రద్దుచేయ బడిన సందర్భములో గాని, సో. సో. ప్ర. సమ్మేళనం యొక్క సుప్రీం సోవియట్ అధికారకాల పరిమితిఅంతమైన రోజునుండిగాని, సుప్రీమ్ సోవియట్ రద్దుచేయబడిన రోజనుండిగాని రెండు నెలల కాలమునకు మించని కాలములోగా నూతనయెన్నికలు జరుగవలెనని సుప్రీంసోవియటు ఆజ్ఞ జారీ చేయును.

నిబంధన 55:—నూతనంగా యెన్నుకోనబడిన సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క సుప్రీంసోవియటు సభను, వెనకటిసో. ప్ర సుప్రీంసోవియటుప్రెసిడీయం, యెన్నికలు అయినతరువాత ఒకనెలరోజులకాలమును దాటకుండా జరుపవలెను.

నిబంధన 56:—రెండు శాసనసభల సంయుక్తసమావేశములో సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క సుప్రీంసోవియటు సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క ప్రజామంత్రిమండలి అనబడు ప్రభుత్వమును నియమించును.

# అధ్యాయం 4

## సమ్మేళన ప్రజాస్వామికముల అత్యున్నతాధికారయుత రాజ్యాంగ సంస్థలు.

నిబంధన 57:—సమ్మేళన ప్రజాస్వామికము యొక్క అత్యున్నతాధికారముగల రాజ్యాంగసంస్థ సమ్మేళనప్రజాస్వామికపు సుప్రీం సోవియటు.

నిబంధన 58:—సమ్మేళన ప్రజాస్వామికపు సుప్రీంసోవియటు ఆప్రజాస్వామిక పౌరులచే నాలుగేండ్ల కాలమునకు ఒకసారి ఎన్నుకొనబడును.

ప్రాతినిధ్య ప్రాతిపదికను సమ్మేళనప్రజాస్వామిక రాజ్యాంగ ప్రణాళిక నిర్ణయించును.

నిబంధన 59:— సమ్మేళన ప్రజాస్వామికపు సుప్రీంసోవియటే ఆప్రజాస్వామికపు యేకైక శాసనసంస్థ.

నిబంధన 60:—సమ్మేళన ప్రజాస్వామికంయొక్క సుప్రీంసోవియటు:—

(అ) సో. సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగ ప్రణాళికలోని 16-వ నిబంధన ననుసరించి ప్రజాస్వామిక రాజ్యాంగ ప్రణాళికను అంగీకరించును; సవరించును.

(ఆ) సమ్మేళనములోని భాగములైన స్వతంత్ర ప్రజాస్వామికముల రాజ్యాంగ ప్రణాళికలను స్థిరపరచును; వాటిసరిహద్దులను నిర్ణయించును.

(ఇ) ప్రజాస్వామికముయొక్క జాతీయార్థిక ప్రణాళికను, ఆదాయవ్యయపట్టికను (బడ్జెట్) అంగీకరించును.

(ఈ) సమ్మేళన ప్రజాస్వామికముయొక్క న్యాయసంస్థలచే శిక్ష విధింపబడిన పౌరులను క్షమించు హక్కునుపయోగించును.

నిబంధన 61:—సమ్మేళన ప్రజాస్వామికము యొక్క సుప్రీంసోవియటు అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, కార్యదర్శి, కొం

దరు సభ్యులు కలిగిన సమ్మెళన ప్రజాస్వామికసంయుక్త సుప్రీం సోవియటు ప్రెసీడియం (అధ్యక్షవర్గము) ను ఎన్నుకొనును.

సమ్మెళనప్రజాస్వామిక సంయుక్త సుప్రీం సోవియటు అధ్యక్షవర్గపు (ప్రెసీడియం) అధికారాలను సమ్మెళన ప్రజాస్వామిక రాజ్యాంగప్రకారము నిర్ణయించును.

నిబంధన 62:—సమ్మెళన ప్రజాస్వామిక సుప్రీం సోవియటు తనసభల నిర్వహణకు ఒక అధ్యక్షుని, ఒకఉపాధ్యక్షుని ఎన్నుకొనును.

నిబంధన 63:—సమ్మెళనప్రజాస్వామిక ప్రభుత్వ మంత్రి మండలి అనిపిలువబడు ప్రభుత్వమును సమ్మెళన ప్రజాస్వామికము యొక్క సుప్రీం సోవియటు నియమించును.

---

# అధ్యాయం 5

సో. సో. ప్ర. సమ్మెళనం యొక్క రాజ్యాంగ సంస్థలు.

నిబంధన 64:—సో. సో. ప్ర. సమ్మెళన రాజ్యాంగకార్యనిర్వాహక, పరిపాలన అత్యున్నతాధికారసంస్థ సో. సో. ప్ర. సమ్మెళనం యొక్క ప్రజామంత్రిమండలి.

నిబంధన 65:—సో. సో. ప్ర. సమ్మెళన ప్రజామంత్రిమండలి సుప్రీంసోవియటుకు బాధ్యతవహించి దానికి జవాబుదారీగా పనిచేయును. సుప్రీం సోవియటు సభల విరామకాలంలో సో. సో. ప్ర సమ్మెళనం యొక్క సుప్రీంసోవియటు ప్రెసీడియము (అధ్యక్షవర్గమునకు) బాధ్యతవహించి, దానికిజవాబుదారీగా పని చేయును.

నిబంధన 66:—సో. సో. ప్ర. సమ్మెళన ప్రజామంత్రి

(ఊ) ఆర్థిక, సాంస్కృతిక, దేశరక్షణ నిర్మాణఅభివృద్ధి సంబంధమైన విషయములలో అవసరమైనప్పుడెల్ల సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రి మండలికిలోబడి పనిచేయు ప్రత్యేకపు సమితులను, కేంద్ర పరిపాలక సంఘములను ఏర్పాటుచేయును.

నిబంధన 69:—సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క అధికారమునకు లోబడియుండు ఉమ్మడిపాలనా ఆర్థిక శాఖల విషయములో సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రివర్గములు జారీచేయు నిర్ణయములను, ఆజ్ఞలను నిలుపుదల (సస్పెండు) చేయుటకును రద్దుచేయుటకును, సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రులు జారీచేయు ఆజ్ఞలను, చేయుసూచనలను రద్దుచేయుటకును సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రివర్గము అధికారము కలిగియున్నది.

నిబంధన 70:—సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రివర్గము సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క సుప్రీంసోవియట్ చే నియమింపబడి యీ క్రింది సభ్యులను కలిగియుండును:

సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రి మండలి అధ్యక్షుడు.
సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రిమండలి ఉపాధ్యక్షుడు
సో. సో. ప్ర. సమ్మేళన ప్రభుత్వ ఆర్థిక ప్రణాళిక రచనాసమితి అధ్యక్షుడు.
సోవియట్ కంట్రోలు సమితి అధ్యక్షుడు.
సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రులు,
లలితకళాసమితి అధ్యక్షుడు.

ఉన్నత విద్యాసమితి అధ్యక్షుడు.
ప్రభుత్వబ్యాంకు సంఘ అధ్యక్షుడు.

నిబంధన 71:—సో. సో. ప్ర. సమ్మేళన ప్రభుత్వము గాని, సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రి గాని యే సో. సో. ప్ర. సమ్మేళన సుప్రీంకోర్టు యెటు సభ్యుడైనా తనను వ్రాతపూర్వకంగా పంపు ప్రశ్నకు మూడు రోజుల గడువు దాటకుండా ఆ యా శాసనసభలలో వాగ్రూపముగాని, వ్రాతరూపముగాని జవాబు ఇచ్చి తీరవలెను.

నిబంధన 72:—సో. సో. ప్ర. సమ్మేళన అధికారమునకు లోబడియుండా ప్రభుత్వ పరిపాలన శాఖలను సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రులు నడిపెదరు.

నిబంధన 73:—ఆ యా ప్రజామంత్రుల ఉపసంఘ అధికారమునకు లోబడి, ఆచరణలోయున్న శాసనముల నాధారము చేసికొని, వాటి ననుసరించియు, సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రివర్గము చూపు నిర్ణయములను, ఆజ్ఞలను అనుసరించియు సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రులు ఆజ్ఞలను, నిర్ణయములను జారీ చేసి, అవి అమలు జరుగునట్లు అజమాయిషీ చేయుదురు.

నిబంధన 74:—సో. సో. ప్ర. సమ్మేళన ప్రజామంత్రుల ఉపసంఘములు అఖిలసమ్మేళన ప్రజాస్వామిక ఉపసంఘములు గాని, సమ్మేళన ప్రజాస్వామిక ఉపసంఘములు గాని అయి వుండును.

నిబంధన 75. అఖిలసమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రుల ఉపసంఘములు సో. సో. ప్ర. సమ్మేళన మండలి అన్ని

భాగములలోను తమ అధికారములకు లోబరచబడిన పరిపాలన శాఖలను తాము స్వయముగా గాని, లేక తాము నియమించు సంఘముల ద్వారా గాని నడుపును.

నిబంధన 76. సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రుల ఉపసంఘములు తమకు అప్పగించబడిన పరిపాలన శాఖలను ఆయా శాఖలకు సంబంధించిన సమ్మేళన ప్రజాస్వామికముల ప్రజామంత్రుల ఉపసంఘముల ద్వారానే నడుపును. సో. సో. ప్ర. సమ్మేళన సుప్రీమ్ సోవియటుచే ధృవపరచబడిన సంస్థల జాబితాలోని నిర్ణీతమైన కొన్ని సంస్థలను మాత్రమే అవి స్వయముగా నడుపును.

నిబంధన 77:— ఈ క్రింది ప్రజామంత్రుల ఉపసంఘములు అఖిల సమ్మేళన ప్రజామంత్రుల ఉపసంఘములు:—

దేశరక్షణ
విదేశాంగ వ్యవహారములు
విదేశ వాణిజ్యము
రైల్వేలు
పోస్టు, టెలిగ్రాఫ్, టెలిఫోనులు
సముద్ర నౌకాదళము
నదీ నౌకాదళము
బొగ్గు గనిపరిశ్రమ
విద్యుచ్ఛక్తి స్టేషన్లు
ఎలెక్ట్రికల్ ఇంజనీరింగు పరిశ్రమ
ఇనుము, ఉక్కు పరిశ్రమ

ప్రభుత్వాదాయము
వర్తకము
స్వదేశ వ్యవహారములు
ప్రభుత్వ భద్రత
న్యాయము
ప్రజారోగ్యము
గృహనిర్మాణావశ్యక వస్తుపరిశ్రమ
ప్రభుత్వ కంట్రోలు.

---

## అధ్యాయం 6

### సమ్మేళన ప్రజాస్వామిక ప్రభుత్వశాఖలు.

నిబంధన 79:—సమ్మేళన ప్రజాస్వామిక ప్రభుత్వాత్యున్నత కార్యనిర్వాహక. పరిపాలక శాఖ సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రివర్గము.

నిబంధన 80.—ఒక సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రివర్గము ఆ సమ్మేళన ప్రజాస్వామిక సుప్రీంసోవియట్‌కు బాధ్యత వహించి దానికి జవాబుదారీగా పని చేయవలెను. సుప్రీంసోవియట్ సభల విరామకాలములో అది తత్సంబంధమైన సుప్రీంసోవియటు ప్రెసీడియముకు బాధ్యత వహించి దానికి జవాబుదారీగా పనిచేయవలెను.

నిబంధన 81:—ఒకసమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రివర్గము సో. సో. ప్ర. సమ్మేళనములోను, ఆసమ్మేళన ప్రజా

స్వాధికములలోను ఆచరణలోయున్న శాసనముల ప్రకారము, హై.సా. ప్ర. సమ్మేళన ప్రజామంత్రివర్గము జారీచేయు, నిర్ణయములు, ఆజ్ఞలపైని ఆధారపడి, వానికనుగుణ్యముగా ఆజ్ఞలను, నిర్ణయములను జారీచేయును.

నిబంధన 32:—ఏక సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రివర్గము స్వతంత్ర ప్రజాస్వామిక ప్రజామంత్రివర్గములు జారీచేయు నిర్ణయములను, ఆజ్ఞలను తాత్కాలికంగా నిలుపుదల చేయుటకును, దేశముల, ప్రాంతముల, స్వతంత్ర రాష్ట్రముల, కార్మిక ప్రజాప్రతినిధుల సోవియట్ల కార్యనిర్వాహక వర్గముల నిర్ణయములను, ఆజ్ఞలను రద్దుచేయుటకును అధికారముకలదు,

నిబంధన 33:—ఏక సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రివర్గము ఆ సమ్మేళన ప్రజాస్వామికపు సుప్రీం సోవియట్ చే నియమింపబడి యీక్రిందిసభ్యులను కలిగియుండును:—

సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రివర్గపు అధ్యక్షుడు, ఉపాధ్యక్షులు,

ప్రభుత్వ ఆర్థిక ప్రణాళికా నిర్మాణసంఘపు అధ్యక్షుడు;

ఈక్రింది పరిశ్రమలకు చెందిన ప్రజామంత్రులు:

ఆహార పరిశ్రమ
చేపల పరిశ్రమ
మాంసము, పాడి పరిశ్రమ.
డీవ పరిశ్రమ
వస్త్ర పరిశ్రమ
కలప పరిశ్రమ

గృహనిర్మాణావసర వస్తుపరిశ్రమ
వ్యవసాయము
ప్రభుత్వ ధాన్య, పశుక్షేత్రములు
ప్రభుత్వ ఆదాయము
వర్తకము
స్వదేశ వ్యవహారములు
ప్రభుత్వ భద్రత
న్యాయము
ప్రజారోగ్యము
ప్రభుత్వకంట్రోలు
విద్య
స్థానిక పరిశ్రమ
మ్యునిసిపల్ ఆర్థిక విధానము
సమాజపోషణ
మోటారు రవాణా:

లలితకళా పరిపాలనా ప్రముఖోద్యోగి

అఖిల సమ్మేళన ప్రజామంత్రుల ఉపసంఘముల ప్రతినిధులు

నిబంధన 84: సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రులు. సమ్మేళన ప్రజాస్వామి కాధికారములకు లోబడియుండు ప్రభుత్వపరిపాలన శాఖలను నడిపెదరు.

నిబంధన 85:—సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క, సమ్మేళన ప్రజాస్వామికంయొక్క శాసనముల నాధారముచేసి కొని వాటికనుగుణ్యముగాను, సో.సో.ప్ర. సమ్మేళన, సమ్మేళన

ప్రజాస్వామిక ప్రజామంత్రివర్గముల నిర్ణయములకు, ఆజ్ఞలకను గుణ్యముగాను, సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రుల ఉపసంఘపు సూచనల, ఆజ్ఞలకను గుణ్యముగాను ఆయా ప్రజామంత్రుల ఉపసంఘములకు లోబడి ఆజ్ఞలను, సూచనలను ప్రకటించును.

నిబంధన 86:—ఒక సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రుల ఉపసంఘములు సమ్మేళన ప్రజాస్వామిక, లేక ప్రజాస్వామిక ప్రజామంత్రుల ఉపసంఘములై యుంటాయి.

నిబంధన 87:—సమ్మేళనప్రజాస్వామిక ప్రజామంత్రి వర్గము దానికి సంబంధించిన సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రుల ఉపసంఘములు రెంటింటికీ లోబడి తమకు అప్పచెప్పబడిన ప్రభుత్వ పరిపాలన శాఖలను సమ్మేళనప్రజాస్వామికప్రజామంత్రుల ఉపసంఘములు నడుపును.

నిబంధన 88.—ప్రజాస్వామిక ప్రజామంత్రుల ఉపసంఘములు తమకు అప్పజెప్పబడిన ప్రభుత్వపరిపాలన శాఖలను సమ్మేళన ప్రజాస్వామిక ప్రజామంత్రివర్గమునకు ప్రత్యక్షముగా లోబడి నడుపును.

# అధ్యాయం 7

## స్వతంత్ర సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామికముల అత్యున్నత ప్రభుత్వ శాఖలు.

నిబంధన 89:—ఒక స్వతంత్ర ప్రజాస్వామిక అత్యున్నత

ప్రభుత్వసంస్థ ఆస్వతంత్రి సోవియటు సోషలిస్టు ప్రజాస్వామికం యొక్క సుప్రీంసోవియట్.

నిబంధన 90:—ఒకస్వతంత్రి ప్రజాస్వామికం యొక్క సుప్రీంసోవియటు సభ్యులు నాలుగేండ్ల కొకమారు ఆస్వతంత్రి ప్రజాస్వామిక రాజ్యాంగ ప్రణాళికలోని ర్ణయింపబడిన ప్రాతినిధ్యపద్ధతిని ఆప్రజాస్వామిక ప్రజలచే యెన్నుకొనబడెదరు.

నిబంధన 91:—ఒకస్వతంత్రి ప్రజాస్వామికంయొక్క సుప్రీంసోవియటే ఆస్వతంత్రి సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామికం యొక్క ఏకైక శాసననిర్మాణ సంస్థ.

నిబంధన 92:—స్వతంత్ర ప్రజాస్వామికంయొక్క ప్రత్యేకపరిస్థితులను పరిగణించి, సమ్మేళన ప్రజాస్వామిక రాజ్యాంగ ప్రణాళికకు పూర్తిగా అనుగుణ్యముగా రచింపబడిన స్వంతరాజ్యాంగ ప్రణాళికను ప్రతిస్వతంత్ర ప్రజాస్వామికమూ కలిగియుండును.

నిబంధన 93:—ఒకస్వతంత్ర ప్రజాస్వామికవు సుప్రీంసోవియటు తనరాజ్యాంగ చట్టమునకనుగుణ్యముగా ఆస్వతంత్ర ప్రజాస్వామికంయొక్క సుప్రీంసోవియట్ ప్రెసీడియమునుయెన్నుకొని స్వతంత్ర ప్రజాస్వామికంయొక్క ప్రజామంత్రివర్గమును కూడ నిర్ణయించును.

## అధ్యాయం 8

### స్థానిక పరిపాలనా శాఖలు.

నిబంధన 94:—దేశాలు, ప్రాంతీయభాగాలు స్వతం

త్రరాష్ట్రాలు, మండలాలు, పట్టణాలు, గ్రామసీమలలో ఎన్నుకోబడిన గ్రామిక ప్రజాప్రతినిధుల సోవియట్ ప్రభుత్వాధికారముల స్థానికపరిపాలనా శాఖలు.

నిబంధన 95:—ఆయా దేశ, ప్రాంత, స్వతంత్ర రాష్ట్ర, పట్టణ, పల్లె వాస్తవ్యులగు కార్మికులచే రెండు సంవత్సరముల కొకపర్యాయము దేశ, ప్రాంత, స్వతంత్ర రాష్ట్ర, పట్టణ, గ్రామ గ్రామిక ప్రజాప్రతినిధి సోవియట్లు యెన్నుకొనబడును.

నిబంధన 96:—గ్రామిక ప్రజాప్రతినిధి సోవియట్లకు ప్రతినిధి యెన్నిక విధానములు ఆయా సమ్మేళన ప్రజాస్వామిక రాజ్యాంగచట్టములలో నిర్వచింపబడును.

నిబంధన 97:—గ్రామిక ప్రజాప్రతినిధి సోవియట్లు తమకు లోబడిన స్థానిక పరిపాలనా శాఖల విధినిర్వాహణను సక్రమముగా నడిపించుట, శాంతిభద్రతలను కాపాడుట, పౌరహక్కుల రక్షణ, స్థానిక, ఆర్థిక, వైజ్ఞానిక వ్యవస్థల సక్రమ నిర్వహణాభివృద్ధులు, స్థానిక శాఖల ఆయవ్యయపట్టికలు తయారుచేయుట మున్నగువిధులను నిర్వహించును.

నిబంధన 98:—సో. సో. ప్ర. సమ్మేళన, సమ్మేళన ప్రజాస్వామిక రాజ్యాంగచట్టములవలన కలిగిన అధికారముల మేరకులోబడి, గ్రామిక ప్రజాప్రతినిధి సోవియట్లు నిర్ణయములను చేయుట, ఆజ్ఞలు జారీచేయుట చేయుదురు.

నిబంధన 99:—దేశ, ప్రాంత, స్వతంత్ర రాష్ట్ర, మండల, పట్టణ, గ్రామ గ్రామిక ప్రజాప్రతినిధి సోవియట్ల కార్యని

ర్వహణ, పరిపాలనా శాఖలు ఒక అధ్యక్షుడు, ఒక ఉపాధ్యక్షుడు, కార్యదర్శి, సభ్యులతో కూడుకొన్న కార్యనిర్వాహక వర్గములచే నడుపబడును.

నిబంధన 100:—సమ్మేళన ప్రజాస్వామిక రాజ్యాంగములో నిర్దేశించ బడినట్లుగా చిన్న గ్రామాల్లోని శ్రామిక ప్రజా ప్రతినిధి సోవియట్ల పరిపాలనా, కార్యనిర్వహణలు అధ్యక్ష, ఉపాధ్యక్ష, కార్యదర్శులతో కూడిన కార్యనిర్వాహక వర్గముచే కొనసాగింపబడును.

నిబంధన 101:—శ్రామిక ప్రజాప్రతినిధి సోవియట్ల కార్యనిర్వాహణ శాఖలు తమనెన్నుకొనిన శ్రామిక ప్రజాప్రతినిధి సోవియట్లకు బాధ్యతవహించి సమాధానము చెప్పుకొనవలయును.

---

# అధ్యాయం 9

## న్యాయస్థానములు,

నిబంధన 102:—సో. సో. ప్ర. సమ్మేళన ఉన్నతన్యాయస్థానము. సమ్మేళన ప్రజాస్వామిక ఉన్నతన్యాయస్థానములు, ప్రాదేశిక, ప్రాంతీయ న్యాయస్థానములు, స్వతంత్ర రాష్ట్ర న్యాయస్థానములు, మండల న్యాయస్థానములు. సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క ఉన్నత సోవియట్ నిర్ణయానుసారము నెలకొల్పబడిన ప్రత్యేకన్యాయస్థానముల ద్వారా సో.సో.ప్ర. సమ్మేళనంలో న్యాయవిచారణ జరుగును.

నిబంధన 103:—అన్ని న్యాయస్థానాలలోను ప్రత్యేక

ము శాసనములచే నిషేధింప బడితేనేగాని అన్ని వివాదముల విచారణయు ప్రజా అస్సెస్సర్ల సమక్షమున జరుపబడును.

నిబంధన 104:—సో. సో. ప్ర. సమ్మేళన ఉన్నత న్యాయస్థానం (సుప్రీంకోర్టు) అత్యున్నత న్యాయశాఖగాన సో. సో. ప్ర. సమ్మేళనంలోని సమ్మేళన ప్రజాస్వామికములలోను ఉన్న సర్వ న్యాయస్థానములపైన, వాటి నిర్వహణ కార్యకలాపములపైన అజమాయిషీ చేయుచుండును.

నిబంధన 105:—సో. సో. ప్ర సమ్మేళనం యొక్క ఉన్నత న్యాయస్థాన, ప్రత్యేక న్యాయస్థానములు, సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క ఉన్నతసోవియట్ వలన ఐదు సంవత్సరముల కొకపర్యాయం ఎన్నుకొనబడుచుండును.

నిబంధన 106:—సమ్మేళన ప్రజాస్వామికముల ఉన్నత న్యాయస్థానములు సమ్మేళనప్రజాస్వామికముల ఉన్నత సోవియట్లచే ఐదు సంవత్సరముల కొకపర్యాయం ఎన్నుకొనబడును.

నిబంధన 107:—స్వతంత్ర ప్రజాస్వామికముల ఉన్నత న్యాయస్థానములు 5 సంవత్సరముల కొకపర్యాయము స్వతంత్ర ప్రజాస్వామికముల ఉన్నతసోవియట్లచే ఎన్నుకొనబడును.

నిబంధన 108:—ప్రాదేశిక, ప్రాంతీయ, స్వతంత్ర రాష్ట్రీయ న్యాయస్థానములు ఆయా ప్రాదేశిక, ప్రాంతీయ, స్వతంత్ర రాష్ట్రీయ శ్రామిక ప్రజాప్రతినిధి సోవియట్లచే 5 సంవత్సరముల కొకపర్యాయం ఎన్నుకొనబడుచుండును.

నిబంధన 109:—మండల ప్రజాన్యాయస్థానములు, ప్రతి మండలపు పౌరులచేతను సమాన, సార్వజనీన, [illegible]

పద్ధతులచే మూడు సంవత్సరముల కొక పర్యాయం యెన్ను కొనబడును.

నిబంధన 110:—సమ్మేళన ప్రజాస్వామిక, స్వతంత్ర రాష్ట్ర, స్వతంత్ర ప్రాంతములలోని ప్రాంతీయభాషలలో అచ్చటి న్యాయస్థాన వ్యవహారములన్నియు జరుపబడును. ప్రాంతీయభాష తెలియని పౌరులకు వివాదాంశములను విశదముగా అర్థముచేసికొన గలందులకై ద్విభాషుల సహాయం కలుగజేయు బడును.

నిబంధన 111:—సో. సో. ప్ర. సమ్మేళనంలోని సకలన్యాయస్థానములలోను ప్రత్యేక శాసనముచే తద్విరుద్ధముగా ఆజ్ఞాపించబడిన నేతప్ప, బహిరంగముగా విచారణలు జరుపబడును. నేరమోపబడిన ముద్దాయీలకు న్యాయవాదులను నియమించుకొని ప్రతివాదములను చేయించుకొనుటకు హక్కు కలదు.

నిబంధన 112:—న్యాయాధికారులు శాసనములకు మాత్రమే లోబడిన సర్వస్వతంత్రులు.

నిబంధన 113:—ప్రజామంత్రుల ఉపసంఘములు, వారికిలోబడి పనిచేయు సంస్థలేకాక సో. సో. ప్ర. సమ్మేళన ప్రజాసేవకులు, పౌరులుగూడ శాసనములను తు. చ. తప్పకుండ కఠినముగా అమలుజరుపునట్లు చూచు అంతిమ పర్యవేక్షణాధికారము సో. సో. ప్ర. సమ్మేళనం యొక్క ప్రొక్యురేటర్ (Procurator) కు చెందును.

నిబంధన 114:—సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క ప్రొక్యురేటరు సో. సో. ప్ర. సమ్మేళన సుప్రీం సోవియటుచేత

ఏడేండ్లకొక పర్యాయము నియమించబడును.

నిబంధన 115:—ప్రజాస్వామిక, ప్రాదేశిక, ప్రాంతీయ ప్రాక్యురేటర్లే కాక స్వతంత్రప్రజాస్వామిక, స్వతంత్రప్రాంత ప్రాక్యురేటర్లుకూడ సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క ప్రాక్యురేటర్ చేత ఐదేండ్లకొకసారి నియమించబడెదరు.

నిబంధన 116:—ప్రదేశ, మండల, నగరముల ప్రాక్యురేటర్లను సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క అంగీకారమునకు లోబడి సమ్మేళన ప్రజాస్వామికముల ప్రాక్యురేటర్లు ఐదేండ్లకొకసారి నియమించెదరు.

నిబంధన 117:—ప్రాక్యురేటరుయొక్క ఆఫీసు శాఖలు ఏయితర స్థానిక ప్రభుత్వశాఖలతోను సంబంధము లేకుండ స్వతంత్రముగా ఒక్క సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క ప్రాక్యురేటరుకు మాత్రమే లోబడి పనిచేయును.

---

## అధ్యాయం 10

### పౌరుల ప్రాథమిక హక్కులు, విధులు.

నిబంధన 118:—సో. సో. ప్ర. సమ్మేళన పౌరులకు పనిచేయు హక్కు కలదు. అనగా వారికి పని కల్పింపబడును. చేసిన పని పరిమితి, గుణములనుబట్టి జీతము పొందుటయును కలవు.

జాతీయ ఆర్థిక విధానమును సోషలిస్టు పద్ధతిని నిర్మించుటయు, సోషలిస్టు సమాజపు ఉత్పత్తిశక్తుల నిరంతర అభివృద్ధియు, ఆర్థిక సంక్షోభముల రాకయొక్క అవకాశముల నిర్మూ

ట్టనయు. నిరుద్యోగ నిర్మూలనయు పనిచేయుహక్కును సాధ్యపరచినవి.

నిబంధన 119:—సో. సో. ప్ర. సమ్మేళన పౌరులకు విశ్రాంతి విరామములుగైకొను హక్కుగలదు.

అత్యధిక సంఖ్యాక కార్మికుల పనికాలమును ఏడుగంటలకు తగ్గించుటవలనను కార్మికులకు, ఉద్యోగులకు పూర్తిజీతములతో సాంవత్సరిక సెలవులను కలిగించుటవలనను, ఆయాప్రదేశములలో అనేక ఆరోగ్యకేంద్రములు, విశ్రాంతిగృహములు, క్రీడాకేంద్రములు కార్మిక జనసామాన్య ఉపయోగార్థము నిర్మించుటవలననూ పౌరులకు విశ్రాంతివిరామముల హక్కుకలుగచేయుబడును.

నిబంధన 120:—సో. సో. ప్ర. సమ్మేళన పౌరులకువృద్ధాప్యమునందు, అనారోగ్యకాలమందు, పనిచేయుశక్తిపోయినప్పుడు పోషింపబడు హక్కుకలదు.

ప్రభుత్వవ్యయముతో కార్మికుల, ఉద్యోగుల సాంఘికభీమాను విస్తారముగా అభివృద్ధి పరచుటచేతను, శ్రామికులకు ఉచితవైద్య సౌకర్యము కలుగచేయుటచేతను, శ్రామికుల ఉపయోగార్థము ఆయాప్రదేశములలో అనేక ఆరోగ్యక్షేత్రములు నిర్మాణమువలనను పైహక్కు కలుగచేయుబడును.

నిబంధన 121:—సో. సో. ప్ర. సమ్మేళన పౌరులకు విద్యనేర్చుకొను హక్కుకలదు.

సార్వజనీన నిర్బంధ ప్రాథమిక విద్యావిధానము ద్వారాను, ఉచితవిద్యయేకాక ఉన్నతవిద్యద్వారాను; విశ్వవిద్యా

లయములు, కళాశాలలలోని అనేకసంఖ్యాక విద్యార్థులకు వృత్తివేతనముల (స్టయిపెండ్ల) ద్వారాను; విద్యాలయములలో ఆయా ప్రాంతీయభాషలలో విద్యాబోధనద్వారాను; ఫ్యాక్టరీలు వృత్తిక్షేత్రములు, యంత్ర మరనాగలి కేంద్రములు, సమిష్టి వ్యవసాయ క్షేత్రములలోని శ్రామికులకు ఉచిత, వృత్తి, సాంకేతిక, వ్యావసాయిక శిక్షణద్వారాను యీహక్కు అమలు జరుపబడును.

నిబంధన 122:—ఆర్థిక, రాజ్యాంగ, సాంస్కృతిక, సామాజిక, రాజకీయ రంగములన్నింటిలోను సో. సో. ప్ర. సమ్మేళనంలోని స్త్రీలకు పురుషులతో సమానహక్కులు కలవు.

స్త్రీల యీ హక్కుల ఆచరణావకాశము, పురుషులతో సమానమైన పని చేయుహక్కు, పనిప్రతిఫలముగా జీతముపొందుహక్కు, విశ్రాంతి విరామములు, సాంఘిక భీమా, విద్యలు పొందుహక్కు, ప్రభుత్వముచేత మాతాశిశువుల రక్షణ పొందుహక్కు, పూర్తిజీతముతో ప్రసూతికేంద్రము, ప్రసూతికాలమందు సెలవుపొందుహక్కు, అనేకప్రసూతి కేంద్రములు, శిశుపోషణాలయములు, శిశురక్షణాలయముల యేర్పాటుద్వారా అమలుజరుపబడును.

నిబంధన 123:—సో. సో. ప్ర. సమ్మేళన పౌరులు జాతి మత కులభేదములేక ఆర్థిక, రాజ్యాంగ, సాంస్కృతిక, సాంఘిక రాజకీయ జీవితరంగములన్నింటిలోను సమానహక్కులు కలిగియుందురు. ఈహక్కు అతిక్రమింపరాని శాసనము

పౌరుల యీ హక్కులపట్ల విపక్షతచూపి ... హక్కు

లను ప్రత్యక్షముగా గాని, పరోక్షముగాగాని నిరోధించుటయు లేక తద్విరుద్ధముగా ప్రత్యక్ష పరోక్ష సౌకర్యములను కలుగ చేయుటయు, జాతి మత ప్రత్యేకతను, ద్వేషమును, వైషమ్యతను ప్రబోధించుటయు శాసనప్రకారం శిక్షార్హములు.

నిబంధన 124:—సో. సో. ప్ర. సమ్మేళన పౌరుల ఆత్మ స్వాతంత్ర్యరక్షణార్థమై మతమును ప్రభుత్వమునుండి, విద్యా విధానమునుండి విడదీసిమతవిషయమైన వ్యక్తిస్వాతంత్ర్య మివ్వ బడినది, మతవ్యతిరేక ప్రచారమునకు కూడ స్వాతంత్ర్య మివ్వ బడినది.

నిబంధన 125:—కార్మికుల ప్రయోజనముల ననుసరించి పోషలిస్టు వ్యవస్థను బలపరచుటకుగాను సో సో. ప్ర. సమ్మేళన పౌరులకు శాసనప్రకారము ఈ క్రిందిహక్కులు కలుగజేయబడును.

(అ) వాక్స్వాతంత్ర్యము.

(ఆ) ముద్రణా స్వాతంత్ర్యము.

(ఇ) బహిరంగ సభా వేశములు జరుపుకొను హక్కు తోబాటు సమావేశ స్వాతంత్ర్యము.

(ఈ) ఊరేగింపులు, ప్రదర్శనములు చేసుకొనుహక్కు కలదు.

కార్మికుల, వారిసంఘముల అధీనములో ముద్రణాల యములు, కాగితము, బహిరంగ గృహములు, వీధులు, రవాణా సౌకర్యములు, ఇతర అవసరములుపై హక్కుల వినియోగార్థమై వుంచుటద్వారా ఈపైహక్కులు అమలుపరుచబడును.

నిబంధన 126:—కార్మికుల ప్రయోజనముల ననుసరించి,

ప్రజాసామాన్యము యొక్క నిర్మాణపు పోరవను, రాజకీ
య కార్యకలాపములను అభివృద్ధిపరచుటకును కార్మిక సంఘ
ములు, సహకారసంస్థలు, యువజనసంఘములు, క్రీడాసంఘము
లు, పౌరరక్షణ సంస్థలు, వైజ్ఞానిక, సాంకేతిక, శాస్త్రసంఘము
లు మొదలైన ప్రజాసంస్థలలో ఐక్యమయ్యేందుకుగాను, శ్రామికుల
ప్రజా, ప్రభుత్వ సంఘములు రెండింటిలో నాయకపాత్రను
వహించునట్టియు, సోషలిస్టు వ్యవస్థను బలపరచి, అభివృద్ధి పర
చుటకు చేయు పోరాటములో ప్రథమశ్రేణి అయినట్టియు సోవి
యట్ యూనియన్ కమ్యూనిస్టు (బోల్షివిక్) పార్టీలో కార్మిక
వర్గములోను, యితర శ్రామికులలోను అతిచురుకైనట్టియు,
అత్యున్నత రాజకీయ చైతన్యము కలిగినట్టియు సభ్యులు సంఘ
టితమవుటకును సో. సో. ప్ర. సమ్మేళన పౌరులు హక్కును
కలిగియున్నారు.

నిబంధన 127:—సో. సో. ప్ర. సమ్మేళన పౌరులకు తమ శరీరమును కాపాడుకొను హక్కుగలదు. న్యాయస్థాన నిర్ణయ ప్రకారము గాని, ప్రాక్యురేటరు ఆజ్ఞ ననుసరించిగాని మాత్రమే ఎవరినైన అరెస్టు చేయవచ్చును.

నిబంధన 128:—పౌరులకు తమ గృహములను రక్షించుకొనుటకును, ఉత్తరప్రత్యుత్తరములను రహస్యముగా ఉంచుకొనుటకును హక్కుగలదు.

నిబంధన 129:—కార్మికుల హక్కులకై పోరాడినందుకుగాని, తమ శాస్త్ర కృషికిగాని, దేశస్వాతంత్ర్య సంపాదనా కృషికిగాని బాధింపబడిన విదేశపౌరులకు సో. సో. ప్ర. సమ్మేళన

ను రక్షణయిచ్చును,

నిబంధన 130:—సో. సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగచట్టము ననుసరించుట, శాసనములను పాటించుట, కార్మిక శ్రమ శిక్షణను కాపాడుట, పౌర బాధ్యతలను సమ్యకముగా ఆదరించుట, సోషలిస్టు పరస్పర సంబంధ సిద్ధాంతములను గౌరవించుట సో. సో. ప్ర. సమ్మేళన పౌరులందరి విధి.

నిబంధన 131.—ప్రజలసోషలిస్టు ఆస్తిని సోవియట్ విధానమునకు పవిత్రమైన, అతిక్రమింపరాని పునాదిగాను, దేశముయొక్క ఐశ్వర్యమునకు శక్తికిమూల కందముగాను, కార్మిక జనసామాన్యమంతటి అభివృద్ధికిని, సాంస్కృతిక జీవనమునకు మూలముగాను యెంచి, రక్షించి, బలపరచుట సో॥సో॥ప్ర॥ సమ్మేళన పౌరులందరి విధి.

నిబంధన 132:—సార్వజనీన సైనిక సేవ శాసనబద్ధము. కార్మిక, కర్షకుల ఎర్రసైన్యములో జేరి సైనిక సేవచేయుట సో. సో. ప్ర. సమ్మేళన పౌరుల గౌరవకరమైన బాధ్యత.

నిబంధన 133:—స్వదేశ రక్షణము సో. సో. ప్ర. సమ్మేళన పౌరులందరి పవిత్రమైన బాధ్యత. రాజభక్తిప్రమాణమును మీరుట పారిపోయి శత్రువులతో చేరుట, ప్రభుత్వసైనికశక్తిని కుంటుపరచుట, వేగుపని చేయుట మొదలైన దేశద్రోహ కార్యములు అతిదుష్టమైన నేరములుగా పరిగణింపబడి అతినాతి కఠినమైన శాసన ప్రకారము శిక్షింపబడును.

---

# అధ్యాయం 11

## ఎన్నికల విధానం.

---o---

నిబంధన 134:—సో. సో. ప్ర. సమ్మేళన సుప్రీం సోవియటు సభ్యులు, సమ్మేళన ప్రజాస్వామికముల సుప్రీం సోవియట్ల సభ్యులు, ప్రాదేశిక, ప్రాంతీయ కార్మికజనసామాన్య ప్రతినిధుల సోవియట్ల సభ్యులు, స్వతంత్ర ప్రజాస్వామికముల సుప్రీం సోవియట్ సభ్యులు, స్వతంత్ర ప్రాంతరాష్ట్ర, మండల నగర, గ్రామ కార్మిక జన సామాన్య ప్రతినిధుల సోవియట్ల సభ్యులు మొదలైన అన్ని కార్మిక ప్రతినిధుల సోవియట్ల సభ్యులు ప్రజలచే సార్వజనీన, సమాన, ప్రత్యక్ష, రహస్య ఓటింగు పద్ధతిని ఎన్నుకొనబడుదురు.

నిబంధన 135:—ప్రతినిధుల యెన్నికలు సార్వజనీనములు. జాతి, మత, కులములు, విద్యా, నివాస సౌకర్యములు, సాంఘికస్థితి (Social origin) ఆస్తిప్రపత్తులు, పూర్వకార్య కలాపముల విచక్షణ లేకుండ పదునెనిమిదేండ్ల వయస్సుకలిగిన సో. సో. ప్ర. సమ్మేళన పౌరులందరూ ప్రతినిధుల నెన్నుకొనుటకును, ప్రతినిధులుగా యెన్నుకొన బడుటకును హక్కుకలిగియుందురు. పిచ్చివారు, న్యాయస్థానములో శిక్ష విధింపబడినవారును, యెన్నిక హక్కు రద్దుచేయుబడు శిక్షను పొందినవారునుమాత్రము ఓటు హక్కు కలిగియుండరు.

నిబంధన 136:—ప్రతినిధుల యెన్నికలు సమానములు.

ప్రతి పౌరునకూ ఒక ఓటుకలదు. ఎన్నికలలో పౌరులెల్లరూ సమాన ప్రతిపత్తిలో పాల్గొందురు.

నిబంధన 137:—ఎన్నుకొనుటకును, యెన్నుకొనబడుటకును స్త్రీలు పురుషులతో సమానమైన హక్కునుకలిగి యున్నారు.

నిబంధన 138:—ఎర్రసైన్యములో నున్న పౌరులుసమానమైన సహరతులతో ఎన్నుకొనుటకును, ఎన్నుకొనబడుటకును యితర పౌరులందరితో సమానమైన హక్కును కలిగియున్నారు,

నిబంధన 139:—ప్రతినిధుల ఎన్నికలు ప్రత్యక్షములు. గ్రామ, నగర కార్మిక ప్రతినిధుల సోవియట్లు మొదలు సో. సో. ప్ర. సమ్మేళన సుప్రీం సోవియట్‌వరకు అన్ని సోవియట్లు (వా) జలచే ప్రత్యక్ష ఓటింగుపద్ధతిని ఎన్నుకొనబడును.

నిబంధన 140:—ప్రతినిధుల యెన్నికలు రహస్యముగా జరుగును.

నిబంధన 141:—ఎన్నికకు అభ్యర్థులు ఎన్నికప్రాంతీయ పద్ధతిని నియమింపబడుదురు.

కమ్యూనిస్టుపార్టీ శాఖలు, కార్మిక సంఘములు, సహకారసంస్థలు, యువజన సంఘములు, వైజ్ఞానిక సమితులు మొదలైన కార్మికుల ప్రజాసంఘములు, సమితులు యెన్నికలకు అభ్యర్థులను నియమించు హక్కుకలిగియున్నవి.

నిబంధన 142:—తన నియోజకవర్గములోని ప్రజలకు తనయొక్క, కార్మిక ప్రతినిధుల సోవియటుయొక్క కార్యకలాపాలను గురించి తెలియచేయుట ప్రతిప్రతినిధి విధియై యు

న్నది. నియోజకవర్గములోని అధికసంఖ్యాక ఓటర్ల నిర్ణయము పై యేనాటైనను శాసనసభ్యుని అభ్యర్థిని తొలగించవచ్చును.

—(o)—

## అధ్యాయం 12

ప్రభుత్వ చిహ్నములు, జండా, ముఖ్యపట్నం.

నిబంధన 143:—సో. సో. ప్ర. సమ్మేళనం యొక్క శాఖలు (arms) సూర్యకిరణములలో చిత్రింపబడిన భూగోళముపైన సుత్తీ, కొడవళ్లను కలిగి, సమ్మేళన ప్రజాస్వామిక భాషలలో "ప్రపంచ కార్మికులారా ఏకముకండు!" అను నినాదము కలిగిన చెవులవంటి ధాన్యపు కంకులతో చుట్టబడియుండును. ఈ శాఖలపైన పంచకోణ నక్షత్రముండును.

నిబంధన 144.—సో. సో. ప్ర. సమ్మేళన ప్రభుత్వ పతాకము. జండాకర్ర సమీపమునపై మూలలో బంగారురంగులో చిత్రింపబడిన సుత్తీ కొడవళ్లను, వానిపైన బంగారువర్ణపు బోర్డరు కలిగిన అరుణ పంచకోణ నక్షత్రము కలిగిన ఎర్రజండా పొడుగు, వెడల్పుల. నిష్పత్తి 2:1.

నిబంధన 145:—సో. సో. ప్ర. సమ్మేళనము యొక్క ముఖ్యపట్టణము మాస్కో నగరము.

—(o)—

## అధ్యాయం 13

రాజ్యాంగచట్ట సంస్కరణకు కార్యక్రమం.

నిబంధన 146:—సో. సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగ

ప్రణాళికలో ఒక్క సుప్రీం సోవియట్టు మాత్రమే రెండు శాసన సభలలోను మూడింట రెండువంతుల మెజారిటీచే తగు తగ్గన కానివోట్లతో సంస్కరణలు చేయువాక్కు కలిగియున్నది.

—o—

# అనుబంధములు.

—(o)—

## సో॥ సో॥ ప్ర॥ సమ్మేళన సుప్రీం సోవియట్ యొక్క పదవ సమావేశంలో అంగీకరింప బడిన శాసనములు.

### అనుబంధం. 1

సమ్మేళన ప్రజాస్వామికముల సైన్యనిర్మాణము పైనను, ఆసందర్భములో అఖిలసమ్మేళన దేశరక్షణ ప్రజామంత్రుల ఉపసంఘమును సమ్మేళన దేశరక్షణ ప్రజామంత్రుల ఉపసంఘముగా మార్చుటకును శాసనము.

సో. సో. ప్ర. సమ్మేళన రక్షణావకాశములను దృఢపరచు ఆశయముతో సుప్రీం సోవియట్ యీక్రింది ఆజ్ఞను జారీచేయుచున్నది.

1. ఆయా సమ్మేళన ప్రజా స్వామికములే తమ తమ రక్షణసైన్యనిర్మాణ కార్యములు చేసికొనుటకును,

2. సో.సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగ ప్రణాళికలో యీ

క్రింది సవరణలను ప్రవేశ పెట్టుటకును

(అ) సో. సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగ వ్రణాళికలోని నిబంధన 14 లో 7-వ అంశములో "సో. సో. ప్ర. సమ్మేళనం యొక్క రక్షణయేర్పాట్లు చేయుట, సో. సో. ప్ర. సమ్మేళనం యొక్క సాయుధసైన్యము లన్నింటిని నడిపించుట" అను మాటల తరువాత "సమ్మేళన ప్రజాస్వామికముల సైన్య నిర్మాణ మూల సూత్రములను యేర్పాటుచేయుట." అనుమాటలను జేర్చి యీవిషయములను క్రిందివిధముగా నిర్వచించుట:

7. సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క రక్షణయేర్పాట్లుచేయుట, సో. సో. ప్ర. సమ్మేళనంయొక్క సాయుధసైన్యములన్నింటినీ నడిపించుట, సమ్మేళన ప్రజాస్వామికముల సైన్య నిర్మాణ మూలసూత్రములను యేర్పాటుచేయుట,

(ఆ) సో. సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగప్రణాళిక యొక్క నిబంధన 18 లో (అ) అంశంలో యీక్రిందిమాటలు జేర్చుటకు.

నిబంధన 18 (అ)"ప్రతిసమ్మేళన ప్రజాస్వామికమూ తన స్వంతసైన్య నిర్మాణము కలిగియుండును."

(ఇ) సో. సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగ ప్రణాళిక యొక్క 60-వ నిబంధనలో (ఊ) అను యీక్రింది అంశమును జేర్చుటకు.

(ఊ) "ప్రజాస్వామిక సైన్యనిర్మాణవిధానమును నిర్ణయించును."

3. అఖిల సమ్మేళన దేశరక్షణ ప్రజామంత్రుల ఉపసంఘమును సమ్మేళన రక్షణ ప్రజామంత్రుల ఉపసంఘముగా పునర్నిర్మాణము కావించుటకు

యమ్. కాలినిన్.
అధ్యక్షుడు.

సో. సో. ప్రి, సమ్మేళన సుమ్మేళన సుప్రీం సోవియట్ ప్రెసీడియం.

ఎ. గోర్కిన్

కార్యదర్శి.

సో. సో. ప్రి. సమ్మేళన సుప్రీం సోవియట్ ప్రెసీడియం

మాస్కో; క్రెమ్లిన్ భవనం
ఫిబ్రవరి 1, 1944

——— (o) ———

## అనుబంధం 2

సమ్మేళన ప్రజాస్వామికములకు విదేశాంగ నీతివిషయమై సర్వాధికార ప్రదానముపైనను, అఖిలసమ్మేళన విదేశాంగ ప్రజామంత్రుల ఉపసంఘమును, సమ్మేళన ప్రజాస్వామిక విదేశాంగ ప్రజామంత్రుల ఉపసంఘముగా పునర్నిర్మించుటకును శాసనము

అంతర్జాతీయ సంబంధములను వృద్ధిపరచు నుద్దేశముతోను, యితర ప్రభుత్వములతో సా॥ సో॥ ప్ర॥ సమ్మేళనమునకు గల స్నేహబంధాలను పటిష్ఠపరచుటకును, విదేశప్రభుత్వములతో ప్రత్యక్షసంబంధ బాంధవ్యములను కలిగియుండు విషయములో సమ్మేళన ప్రజాస్వామికముల దినదినమూ పెరుగుచున్న అవసరమును గమనించియు సా. సో. ప్ర. సమ్మేళన సుప్రీము సోవియటు జారీ చేయు ఆజ్ఞలు:

1. సమ్మేళన ప్రజాస్వామికములు విదేశములతో ప్రత్యక్షసంబంధము కలిగియుండవచ్చును: వాటితో ఒడంబడికలు చేసుకొనవచ్చును.

2. సా॥ సో॥ ప్ర॥ సమ్మేళన రాజ్యాంగ ప్రణాళికలో యీ క్రింది సవరణలు చేయుటకు.

(అ) సా॥ సో॥ ప్ర॥ సమ్మేళన రాజ్యాంగ ప్రణాళిక యొక్క 14-వ నిబంధనలో 1-వ అంశంలో "అంతర్జాతీయ సంబంధములను నిర్ణయించుటకు సమ్మేళనమునకు ప్రాతినిధ్యమువహించుట, విదేశప్రభుత్వములతో సంధులు, ఒడంబడికలు చేసికొనుట, ఆమోదించుట" అనుమాటల తరువాత "విదేశప్రభుత్వములకు సమ్మేళన ప్రజాస్వామికములకు మధ్యగల సంబంధములలో ఏక విధానమును యేర్పరచుట" అనుమాటలను చేర్చి యీ క్రిందివిధముగా రచించుట:

(1) "అంతర్జాతీయ సంబంధములను నిర్ణయించుటకు సమ్మేళనమునకు ప్రాతినిధ్యము వహించుట, విదేశప్రభుత్వముల

తో సంధులు, ఒడంబడికలు చేసికొనుట, ఆమోదించుట, విదేశ ప్రభుత్వములకు సమ్మేళన ప్రజాస్వామికములకు మధ్యగల సంబంధములలో ఏకవిధానము నేర్పరుచుట.

(ఆ) సో.సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగ ప్రణాళిక 18-వ నిబంధనకు, యీక్రిందివిధముగా (అ) అంశం జేర్చుటకు.

నిబంధన 18:—(అ) ప్రతి సమ్మేళన ప్రజాస్వామిక మూ పరప్రభుత్వములతో ప్రత్యక్షసంబంధములను కలిగియుండుటకును, వాటితో ఒడంబడికలు చేసికొనుటకును, ఒక దేశమంత్రివర్గ, రాయబారి ప్రతినిధులను మరియాయా దేశమునకు పంపుకొనుటకును హక్కుగలిగియున్నది.

(ఇ) సో. సో. ప్ర. సమ్మేళన రాజ్యాంగ ప్రణాళిక యొక్క 60-వ నిబంధనకు యీక్రింది (ఉ) అను అంశమును జేర్చుటకు:

(ఉ) "అంతర్జాతీయ వ్యవహారములలో సమ్మేళనప్రజాస్వామిక ప్రాతినిధ్యము నేర్పరుచుట."

3. అఖిల సమ్మేళన విదేశాంగ ప్రజామంత్రుల ఉపసంఘమును సమ్మేళన ప్రజాస్వామిక విదేశాంగ ప్రజామంత్రుల ఉపసంఘముగా పునర్నిర్మించుటకు

యం. కాలినిన్
సో. సో. ప్ర. సమ్మేళన సుప్రీం సోవియట్ ప్రెసీడియం
అధ్యక్షుడు.

ఎ. గార్కిన్

సో. సో. ప్ర. సమ్మేళన సుప్రీంసోవియట్ ప్రెసీడియం
కార్యదర్శి.

మాస్కో, క్రెమ్లిన్‌భవనం
ఫిబ్రవరి 1, 1944



# సోవియట్ చైనా రాజ్యాంగ ప్రణాళిక

చైనా దేశములో సాధింపబడవలసిన ప్రధాన విషయములను ప్రథమ అఖిల చైనా సోవియట్ కాంగ్రెస్ చైనా శ్రామిక జనసామాన్యము ముందును, ప్రపంచ శ్రామికుల ముందును సోవియట్ చైనా రాజ్యాంగ ప్రణాళిక రూపములో ప్రకటించుచున్నది.

రాజ్యాంగ ప్రణాళికలోని యీవిషయములు సోవియట్ చైనాలోని వివిధ ప్రాంతములలో యింతకు ముందే ఆచరింపబడుచున్నప్పటికీ చైనాలో సామ్రాజ్యవాదుల, కోమింటాంగువాదుల అధికారము పూర్తిగా అంతరించి, సోవియట్ ప్రజాస్వామికము చైనా అంతటా వ్యాపించిన నాడు మాత్రమే యీరాజ్యాంగ ప్రణాళికను తు, చ, తప్పకుండ సమగ్రంగా ఆచరణలో పెట్టుటకవకాశము కలుగునని, అఖిల చైనా సోవియట్ ప్రథమకాంగ్రెస్ భావించుచున్నది.

చైనా దేశములోని యావన్మంది కార్మికులు, కర్షకులు, కష్టజీవులు కలిసి పూనుకొని తాత్కాలిక చైనా సోవియట్ ప్రజాస్వామిక ప్రభుత్వనాయకత్వమున చైనా అంతటిలోను యీరాజ్యాంగ ప్రణాళికను ఆచరణలోనికి తెచ్చుటకును, ఈ

క్రింది ప్రధానాశయములకై పోరాడుటకును ప్రథమ అఖిల చైనా సోవియట్ కాంగ్రెస్ పిలుపు నిచ్చుచున్నది.

1. సోవియట్ జిల్లాలలో కార్మిక, కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వమును స్థాపించి, దానిని యావత్తు చైనాలోను వ్యాపింపచేయుట యీ సోవియట్ చైనారాజ్యాంగ ప్రణాళిక ఆశయమైయున్నది. జమీందారీ భూస్వామ్య యుగముల చిహ్నములను తుడిచివేయుట, చైనాలోని యుద్ధప్రభువుల అధికార వినాశనము, ఐక్య చైనా నిర్మాణము, క్రమక్రమముగా పెట్టుబడిదారీ విధానము యొక్క అభివృద్ధిని మందగింపచేయుట, ఆర్థికవిధానమును ప్రభుత్వము వశము చేసికొని తానే నిర్మించుట శ్రామికులలో వర్గచైతన్యము నభివృద్ధిపరచి వారిని వర్గసంఘములలో సమీకరించుట, గ్రామసీమలలోని బీదప్రజా సామాన్యమును ఎర్రజెండా నీడను సమీకరించి శ్రామికవర్గ నియంతృత్వమునకు పరివర్తనమును సాధ్యము చేయుటయు యీ నియంతృత్వపు ఆశయములైయున్నవి.

2. సోవియటు చైనా ప్రజాస్వామిక ప్రభుత్వం కార్మిక, కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వముగల రాజ్యాంగమును నిర్మించుచున్నది. అధికారమంతా కార్మికుల, కర్షకుల, ఎర్రసైనికుల సోవియట్లకును, శ్రామికజన సామాన్యమంతటికినీ చెందియుండును. సోవియటు ప్రభుత్వములో తమ అధికారమును అమలులో పెట్టుకొనుటకు గాను కార్మికులు, కర్షకులు, యావన్మంది కష్టజీవులును తమ ప్రతినిధుల నెన్నుకొను హ

హక్కు కలిగి యుందురు. పెట్టుబడిదారులు, జమీందారులు, భూస్వాములు, సైనికవాదులు, అభివృద్ధి నిరోధకులైన అధికారులు, కులకక్షులు (చైనాలో వీరిని ట్యుఖోలని పిలుస్తారు—అనువాదకుడు), పీఠాధిపతులు, అనగా పీడించువారు, విప్లవ వ్యతిరేకులు మాత్రము తమప్రతినిధుల నెన్నుకొని ప్రభుత్వములోనికి పంపు హక్కుగాని, రాజకీయ స్వాతంత్ర్యముగాని కలిగి యుండరు.

3. చైనా సోవియటు ప్రజాస్వామికంలో అంతిమ అధికారాలన్నీ కార్మిక, కర్షకుల ఎర్రసైనికుల సోవియట్ల ప్రతినిధుల అఖిల చైనా కాంగ్రెస్సుకే చెందియుంటాయి. కాంగ్రెస్సుకు, కాంగ్రెస్సుకు గల మధ్యకాలంలో తాత్కాలిక అఖిల చైనా సోవియట్ల కేంద్ర కార్యనిర్వాహక వర్గము అంతిమాధికారములుగల సంస్థగా పనిచేస్తుంది. ఆ కేంద్ర కార్యనిర్వాహక వర్గముచే నియమింపబడిన ప్రజామంత్రుల సమితి శాసనముల చేయుట, ఆజ్ఞలను జారీచేయుట మొదలైన ప్రభుత్వ బాధ్యతల నన్నింటినీ నిర్వర్తిస్తుంది.

4. సోవియట్ ప్రాంతములో ఉన్నంతకాలము యావన్మంది కార్మికులు, కర్షకులు, ఎర్రసైనికులు, కష్టజీవులు వారి కుటుంబములు స్త్రీ పురుష విచక్షణగాని, కుల, మత, జాతి (చైనాలో నివసించుచున్న చైనీయులు, మంగోలియనులు, మహమ్మదీయులు, టిబెటనులు, మోలు, వీరేకాక కొరియనులు, ఫార్మోజావాసులు, అన్నామీయులు, మొదలైనవారంతా) వి

భేదముగాని లేకుండా సోవియట్ చట్టరీత్యా సమానులైన సోవియటు చైనాపౌరులుగా పరిగణింప బడతారు. ప్రభుత్వాధికారమంతా కార్మిక, కర్షకులకు, ఎర్రసైనికులకు కష్టజీవులకు మాత్రమే చెందియుండుటకు గాను సోవియట్ ప్రాంతములలో జరుగు ఎన్నికలు యీ క్రింది నియమముల ననుసరించి జరుగుతాయి.

పైన పేర్కొనబడిన సోవియట్ పౌరులలో పదునారేండ్లు నిండిన ప్రతివారూ ఓటునుకలిగి, సోవియట్లకు జరుగు ఎన్నికలలో ఎన్నుకొనుటకుగాని, ఎన్నుకొనబడుటకుగాని హక్కుకలిగియుంటారు. వారు కార్మిక, కర్షకుల, ఎర్రసైనికుల, కష్టజీవుల సోవియట్ల ప్రతినిధుల కాంగ్రెస్సుకు ప్రతినిధుల నెన్నుకొను హక్కును కలిగియుంటారు. కార్మికులు తమ కర్మాగారములలోను కర్షకులు, చేతిపనివారు, గ్రామీణ బీదప్రజలు తమ తమ ప్రాంతములలోను ప్రతినిధుల నెన్నుకొంటారు. గ్రామ, పట్టణ సోవియట్ల కెన్నుకొనబడిన ప్రతినిధులు నిర్ణీతమైన కొంతకాలము మాత్రము తమ తమ సోవియట్ల నిర్ణయానుసారము పనిచేసి, తమకార్య కలాపములను గురించి తమ తమ నియోజకవర్గముల ప్రజలకు క్రమముతప్పకుండా నివేదికల నిస్తూవుంటారు. బాధ్యతలను సరిగా నిర్వర్తించని ఏప్రతినిధినైనా ఎట్టిసమయములోనైనా ఆనియోజక వర్గములోని ప్రజలు వెనుకకు పిలిపించి, కొత్తప్రతినిధి నెన్నుకొనుహక్కును కలిగియుంటారు, ప్రజాసామాన్యమును పోషలిస్టు సమాజము

వైపుకు నడిపించ కలిగినది కార్మిక వర్గమొక్కటే కనుక సోవియట్ చైనా ప్రభుత్వం, సోవియట్లకు ఎక్కువమంది ప్రతినిధుల నెన్నుకొనుటకు కార్మికులకు అవకాశములను కలిగించుచున్నది.

5. కార్మిక వర్గ జీవిత వ్యయపరిమాణము నత్వరముగా అభివృద్ధిపరచుట, కార్మిక శాసనము చేయుట, రోజున కెనిమిది గంటలపని ప్రవేశపెట్టుట, కనీస వేతనమును నిర్ణయించుట సాంఘిక భీమాయును, నిరుద్యోగులకు ప్రభుత్వ సహాయమును కలుగచేయుట, పరిశ్రమలపై కార్మికుల కధికారమును కలిగించుటయు సోవియట్ ప్రభుత్వ ఆశయములైయుండును.

6. భూస్వామ్య విధానమును భూస్థాపితము చేసి కర్షక జనసామాన్యపు జీవితవ్యయ పరిమాణమును త్వరితముగా అభివృద్ధి చేయుటకుగాను, భూమిని జాతిపరము గావించు అంతిమాశయమును దృష్టిలో నుంచుకొని చైనా సోవియట్ ప్రభుత్వం భూస్వాముల, జమీందారులభూమిని జప్తుచేసి వశపరచుకొని బీద, మధ్యతరగతుల రైతులకు పంచుతుంది.

7. పెట్టుబడిదారీ దోపిడీనుండి కష్టజీవులను సంరక్షించి సోషలిస్టు సమాజమువైపు వారిని నడుపుటయు, పెట్టుబడిదారీ విధానాభివృద్ధిని నిరోధించి కార్మిక, కర్షకుల ప్రయోజనములను పరిరక్షించుటయు చైనాలో సోవియట్ ప్రభుత్వపు ఆశయములై యున్నవి. చైనాలోని సోవియట్ ప్రభుత్వం విప్లవ వ్యతిరేక ప్రభుత్వములు విధించిన మోయలేని అధికప

న్నుల, మామూళ్ల భారమునుండి కష్టజీవులను విముక్తులను చేసి ఒకే అభివృద్ధికరమైన పన్నును అమలులోనికి తెస్తుంది. కార్మిక, కర్షక ప్రజాసామాన్యపు ప్రయోజనములను సంరక్షించు నటువంటి, ప్రజాసామాన్యమునకు సులభగ్రాహ్యమగునట్టి, సోషలిజమునకు దారితీయునట్టి ఆర్థిక విధానమును అమలులో పెట్టి అట్టి ఆర్థిక విధానమును విధ్వంస పరచునట్టిగాని, భంగపరచునట్టి గాని జాతీయ, విజాతీయ పెట్టుబడిదారుల ఎట్టి ప్రయత్నమునైనను చైనా సోవియట్ ప్రభుత్వం సాధ్యమైన సర్వవిధములా యెదుర్కొని భగ్నపరుస్తుంది.

8. సామ్రాజ్యవాదుల బానిసత్వమునుండి చైనాకువిముక్తి కలిగించుటకే తన ఆశయముగా చైనా సోవియటు ప్రభుత్వం భావిస్తోంది. చైనా ప్రజల సంపూర్ణ స్వాతంత్ర్యమును గుర్తిస్తూను, చైనాలోని సామ్రాజ్యవాదులకు రాజకీయ, ఆర్థిక హక్కులను, అవకాశములను పూర్తిగా నిరాకరిస్తూను, వారితో చైనాలోని విప్లవ వ్యతిరేక ప్రభుత్వములు చేసికొన్న అవమ సంధులను, ఋణపత్రములను రద్దుచేస్తూను చైనాసోవియటు ప్రభుత్వం ప్రకటిస్తోంది. సోవియటు చైనాలో యెచ్చటా పదాతి, నావిక, వైమానిక విదేశ సామ్రాజ్యవాద సేనలు ఉండరాదు. సామ్రాజ్య వాదులు కౌలుకు పుచ్చుకున్న ప్రత్యేక ప్రాంతములు గాని, విశేషాధికారములుగాని యెట్టిషరతులు లేకుండా సోవియటు చైనా ప్రభుత్వమునకు తిరిగి యిచ్చివేయాలి. నుంకపు రేవులు, రైల్వేలు, ఓడల కంపెనీలు, గనులు, కర్మాగారములు

ఫ్యాక్టరీలు, మొదలైన వన్నీ సామ్రాజ్యవాదుల చేతులనుండి జప్తు చేయబడి సమాజపరం చేయ బడతాయి. సోవియట్ శాసనములను పూర్తిగా అంగీకరించి యీవిదేశ పెట్టుబడిదారులు తమ వ్యాపార సంస్థల పాతకొల్లను పునరుద్ధరించు కొనుటకు అవకాశ ముంటుంది.

9. బ్రహ్మాండమైన కార్మిక, కర్షక విప్లవమును చైనా అంతటా వ్యాపింపచేసి అంతిమ విజయమును సాధించుటకై చైనాలోని సోవియటు ప్రభుత్వం తన శాయశక్తులాపాటు పడుతుంది. విప్లవకరమైన వర్గ పోరాటములో పాల్గొనుట కష్టజీవులందరి ప్రథమధర్మము, బాధ్యతయని ప్రకటిస్తోంది. క్రమ క్రమముగా సార్వజనీన సైనిక సేవను ప్రవేశపెట్టి యిచ్ఛాపూర్వకమైన సేవనుండి నిర్బంధ సైనిక సేవా పద్ధతికి అభివృద్ధి చేయుటకై ప్రత్యేకకృషిని సలుపుతుంది. విప్లవ రక్షణార్థమై కార్మిక కర్షక, కష్టజీవుల ఆయుధ ధారణ శాసన బద్ధము కావింపబడి విప్లవ వ్యతిరేకులైనటువంటి, పీడించునటువంటి శత్రులన్నీ సంపూర్ణముగా నిరాయుధము కావింపబడతాయి.

10. చైనాలోని సోవియటు ప్రభుత్వం పెట్టుబడిదారీ, భూస్వామ్య ప్రజాసామ్యములను వ్యతిరేకించుతుంది; కార్మిక కర్షక ప్రజాస్వామ్య నిర్మాణార్థమై కృషి సలుపుతుంది. కార్మిక కర్షకులకు, కష్టజీవులకు వాక్సభా పత్రికా స్వాతంత్ర్యములను ప్రసాదిస్తుంది. కార్మిక, కర్షక స్వాతంత్ర్య మార్గములను నిష్కంటకము చేయుటకై పెట్టుబడిదారుల, భూస్వాముల ఆర్థి

కాధికారములను అడుగంట నాశనము చేస్తుంది. సభా, పత్రికా స్వాతంత్ర్యము లనుభవించుటకు ప్రాతిపదికగా కార్మిక, కర్షకులు, కష్టజీవులు మాత్రమే అచ్చుయంత్రములు, సమావేశ స్థలములు మొదలైన వాటిమీద అధికారము కలిగియుంటారు. విప్లవ వ్యతిరేకులు సర్వరాజకీయ స్వాతంత్ర్యములను కోల్పోవుటే కాక వారు చేయు ప్రచారము మొదలైన కార్యక్రమములు కూడ అణచివేయబడతాయి.

11. స్త్రీల విముక్తిని సాధించుట చైనాలోని సోవియటు ప్రభుత్వ ఆశయమై యున్నది. గృహకృత్య నిర్వహణయను బానిసత్వమునుండి స్త్రీలకు క్రమ క్రమముగా విముక్తి కలిగించి, వారికి దేశముయొక్క సాంఘిక, ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక కార్య కలాపములలో పాల్గొను అవకాశము కలిగించుటకుగాను ప్రాతిపదికగా వివాహస్వాతంత్ర్యము మొదలైన హక్కులను ఆచరణలో పెడుతుంది.

12. సోవియటు చైనా ప్రభుత్వం కార్మిక, కర్షకులకు, కష్టజీవులకు విద్యను కలుగ చేస్తానని అభయ మిస్తోంది. సాధ్యమైనంతవరకు ఉచిత సార్వ జనీన విద్యా విధానమును వెంటనే అమలు పరుస్తుంది. నూతన సాంఘిక శక్తుల నభివృద్ధి చేయు ఉద్దేశముతో సోవియటు ప్రభుత్వం యువకుల ప్రయోజనములను రక్షించి, వారికి జాతీయ వైజ్ఞానిక జీవితములో పాల్గొను ప్రతి అవకాశమును కలుగచేస్తుంది.

13. సోవియటు చైనా ప్రభుత్వం కార్మిక, కర్షకులకు,

కష్టజీవులకు నిజమైన మత స్వాతంత్ర్యమును కలుగ చేస్తుంది. మతమునకు, రాజ్యాంగమునకు ఎట్టి సంబంధమూ ఉండరాదను సూత్రమునను సరించి సోవియటు ప్రభుత్వం ఏమతమునకు ఆర్థిక సహాయమును నామోదించుటగాని, చేయుటగాని చేయదు. సోవియటు పౌరులందరూ మత వ్యతిరేక ప్రచారము చేయు హక్కును కలిగియుంటారు. సోవియటు శాసనము ననుసరించినగాని సామ్రాజ్యవాదుల ఏమతసంస్థయు సోవియటు చైనాలో పని చేయు అవకాశము లేదు.

14. సోవియటు చైనా ప్రభుత్వం చైనాలోని అల్పసంఖ్యాక జాతుల స్వయం నిర్ణయహక్కును, సంపూర్ణముగా చైనానుండి విడిపోయి స్వతంత్ర రాజ్యాంగము నేర్పరుచుకొను హక్కును గుర్తిస్తోంది. మంగోలియనులు, టిబెటనులు, మియాలు, యావోలు, కొరియనులు, చైనా గడ్డపై నివసించు ఇతర జాతులన్నీ కూడ సంపూర్ణ స్వయం నిర్ణయ హక్కును అనుభవించవచ్చును. అనగా అవి సోవియట్ చైనా రాజ్యాంగములో చేరనైనా చేరవచ్చును, లేక యిష్టము లేకపోయిన విడిపోయి స్వతంత్ర రాజ్యాంగము నేర్పాటు చేసికొనవచ్చును. అల్పసంఖ్యాక జాతులను సామ్రాజ్యవాదుల, కొమింటాంగు సైనికవాదుల, స్వదేశరాజుల, జమిందారుల, లామాలు మొదలైనవారల బానిసత్వమునుండి, పీడన నుండి విముక్తి చేసి వారి సంపూర్ణ స్వాతంత్ర్యము సాధించుటకు సోవియటు చైనా ప్రభుత్వం ఆయా అల్ప సంఖ్యాక జాతులకు సాధ్య

మైన అన్ని విధములా సహాయము చేస్తుంది. ఆయా జాతుల భాషలను, విజ్ఞానములను అభివృద్ధి చేయుటకు కూడ సోవియట్ ప్రభుత్వం కృషి చేస్తుంది.

15. తమ విప్లవ కార్య కలాపములకు గాను క్రూరముగా హింసించబడిన చైనీయ, విదేశీయ విప్లవవీరులకు సోవియట్ చైనా ప్రభుత్వం ఆశ్రయమిచ్చి, విప్లవ విజయమునకై వారు తిరిగి ద్విగుణీకృతశక్తి యుత్సాహములతో పోరువరుటకు గాను వలయుశక్తి సామర్థ్యములను పొందుటకు తోడ్పడుతుంది

16. సోవియటు చైనాలో నివసించు విదేశీయ కష్టజీవులుకూడ, సోవియటు చైనా ప్రభుత్వముక్రింద స్వదేశీయ కష్టజీవులు పొందు హక్కులను, అవకాశములను సమముగా పొందుదురు.

17. ఓడిన జాతుల శ్రామిక వర్గముతోను, ప్రపంచ శ్రామిక వర్గముతోను, సోవియటు చైనా ప్రభుత్వం ఐక్య విప్లవ సంఘటనను నిర్మించుటకు తన సంసిద్ధతను తెలుపుతోంది కార్మిక వర్గ నియంతృత్వమును సాధించుటకై సోవియటు యూనియనుకు భక్తి పూర్వకమైన తన సౌహార్ద్రమును, సాన్నిహిత్యమును ప్రకటిస్తోంది.

# కర్షక శాసనం.

శ్రామిక వర్గ నాయకత్వమున ప్రారంభింపబడిన కర్షకపోరాటం దినదిన ప్రవర్ధమానముగా అభివృద్ధి చెందుతూ ఉన్నత పథాలను తాకుతోంది. సామ్రాజ్యవాదుల, సైనికవాదుల పాయిథ ప్రతిఘటనను లెక్కించక సోవియట్ ఉద్యమం ప్రబలముగా వృద్ధిజెంది, వ్యాపించుతోంది. ఒకజిల్లా తరువరి మరియొక జిల్లాలో రైతులు ఎర్రసైన్యంలో చేరి శతాబ్దముల తరబడిగా పాతుకు పోయియున్న జమిందారుల, భూస్వాముల, కులక్కుల ఖామందుల పెత్తనమును పడలించి వేసి. అదోపిటేదారుల భూములను జప్తుచేసి పునర్విభజించి భూసామ్య విధానమును, కొమింటాంగు అధికారమును నాశనము చేసి సామ్రాజ్య వ్యతిరేక కర్షక విప్లవ ఆశయములను, సక్రమముగా పరిష్కరించునట్టి కార్మిక, కర్షకుల సోవియట్ ప్రభుత్వమును స్థాపిస్తారు.

చైనీయ కార్మిక, కర్షక, ఎర్రసైనిక ప్రతినిధుల ప్రథమ సోవియట్ కాంగ్రెస్ జమీందారుల, భూస్వాముల భూమిని జప్తుచేయుటను ఆమోదించుచున్నది. భూమిజప్తు, విభజన విషయములలో ఒకేవిధమైన సూత్రముల నమలునందుంచుటకును, విప్లవ వ్యాప్తిని కొనసాగించుటకును కర్షక సమస్యను అతి సమగ్రముగా పరిష్కరించు నటువంటి యీక్రిందికర్షక శాసనమును ప్రథమ కాంగ్రెస్ ఆమోదించి యున్నది.

నిబంధన 1.—జమీందారుల, భూస్వాముల, సైనికవాదు

ల, కులక్కల (ట్యూభోలు), ఖామందుల భూములు వారుస్వయముగా సాగుచేయుచున్నా, కౌలుకిచ్చి సాగుచేయించుతోన్నా యేవిధమైన పరిహారమూ యివ్వకుండానే జప్తుచేయబడతాయి. జప్తుచేయుబడిన భూములను బీద, మధ్యతరగతి రైతుల మధ్య సోవియటు పంచవలెను. పునర్విభజింపబడు భూమిలో ఆభూముల పాతయజమానులు భాగములు పొందు హక్కును కలిగి యుందురు. స్త్రీ, పురుష విభేదము లేకుండా వ్యవసాయ బాలీలు, కూలీలు, శ్రమజీవులైన రైతులు పునర్విభజనలో భూభాగములు పొందుతారు. అదేవిధముగా రైతుజన సామాన్యపు అనుమతిపై పాతపనులు కోల్పోయిన స్వతంత్ర కూలీలుకూడ భూభాగములను పొందుతారు. తాము స్వయముగా పనిచేసుకోలేని వారును, ఆధారపడుటకు బంధువు లెవ్వరూ లేని వారును అయిన వృద్ధులకు, అనాధులకు, వితంతువులకు సోవియటు ప్రభుత్వము సహాయము చేయుట గాని, వారి భూభాగములు సాగు అగునట్లు చూచుటగాని చేయువలెను.

నిబంధన 2:—సోవియట్ ప్రభుత్వరక్షణకును, సామ్రాజ్యవాద ప్రభుత్వ వినాశమునకును జరుగు పోరాటములో ఎర్రసైనికులు ప్రథమశ్రేణి వీరులుగా పాల్గొంటారు. అందుచేత ప్రతి ఎర్రసైనికునకూ భూభాగం తప్పక యిచ్చునట్లూ, ఆభూభాగం సోవియట్ జిల్లాలో వున్నప్పటికీ విప్లవవ్యతిరేక ప్రభుత్వ అధికారములో యింకనువున్న జిల్లాలో వున్నప్పటికీ తప్పక సాగుచేయబడునట్లూ సోవియటు ప్రభుత్వం చూడాలి.

నిబంధన 3:—భూస్వాములుగా వుండి అదేసమయంలో వడ్డీ వ్యాపారస్తులుగా వుండటమే చైనాలోని కులకుల (ట్యుఖోల) ప్రత్యేకత. అందుచేత వారిభూములుకూడ జప్తుచేయబడతాయి, ఏకులకు అయినా తన భూమి జప్తుచేయబడిన తరువాత విప్లవ వ్యతిరేక చర్యలలో పాల్గొనకుండా వుండి భూమిని స్వంతముగా శ్రమపడి సాగుచేయుట కంగీకరించి నట్లయితే అతనికి భూభాగమివ్వవచ్చును గాని, అదిఅతిసారవంతమైన భాగమైయుండరాదు. అతనికి కివ్వబడు భూమియొక్క పరిమితికూడ అతని శ్రమశక్తికి అనుగుణ్యంగా మాత్రమే వుండాలి.

నిబంధన 4:—వివిధ విప్లవ వ్యతిరేక సంస్థలయొక్క, కోమింటాంగు తెల్లసైనికసంస్థలయొక్క విప్లవ వ్యతిరేక చర్యలలో తీవ్రముగా పాల్గొనువారియొక్క ఆస్తులు, భూములు జప్తుచేయ బడతాయి. తమ అమాయకత్వము వలనను, తెలియనితనమువలనను సోవియట్ వ్యతిరేక వుద్యమములోని కీడ్వాబడిన బీద, మధ్య తరగతి రైతుల విషయంలో మెలుకు. వారి అమాయకత్వము వల్ల స్థానిక సోవియటు సభ్యులకు నమ్మకము కలిగి నట్లయితే యీనిబంధనను అక్షరాలా అమలు జరుపక కొన్ని మార్పులు యవచ్చును. కాని వారినాయకుల విషయము లో మటుకు యీనిబంధన అక్షరాలా అమలుజరుపబడుతుంది.

నిబంధన 5:—జమీందారీ యుగపు వ్యవసాయ సంబంధములను, భూమిపై భూస్వాముల వ్యక్తిగత సత్వమువలన నేర్పడు వ్యవసాయ బానిసత్వమును రూపుమాపు సక్రమమైన పద్ధ

తి పాటుపడి పండించు రైతుల మధ్య సమత్వ సూత్రము ననుసరించి భూమిని విభజించుటయేనని ప్రధాన సోవియట్ కాంగ్రెస్ గుర్తిస్తోంది. కర్షక ప్రజాసామాన్యమునకు వివిధ దృక్పథములనుండి పైసూత్రములోని మంచిచెడ్డలను స్థానిక సోవియటు సభ్యులు బోధించివారి అనుమతిపైన మాత్రమే అమలుపెట్టవలెను గాని, ఎట్టిపరిస్థితులలోను బలప్రయోగముచేసి అమలు జరుప ప్రయత్నించరాదు. కర్షక జన సామాన్యముయొక్క కోరికపైను ప్రత్యక్ష సహాయముతోను మాత్రమే యీనియమమును ఆచరణలో పెట్టవలెను, అందుచేత, మధ్యతరగతి రైతులలో అధిక సంఖ్యాకులు యీ సూత్రమును వ్యతిరేకించిన యెడల, సమాన భూవిభజన సూత్రము వారికి అన్వయించదు.

నిబంధన 6:—దేవాలయములు మొదలైన మతసంస్థలకు చెందిన భూములు, గ్రామ కంఠములు మొదలైన సాముదాయిక వసతులన్నీ తప్పక సోవియటు ప్రభుత్వ మాక్రమించుకొని రైతుల వశము కావింపుతుంది. కాని రైతుల మతవిశ్వాసములను గాయపరచకుండ వారి యిష్టానిష్టములపై ఆధారపడి మాత్రమే ఆ భూములను ఆక్రమించుకొని పంచాలి.

నిబంధన 7- ఉత్పత్తి సాధనముల ననుసరించి భూవిభజన జరుగు పద్ధతిని ధనిక రైతులు వాంఛిస్తారు, కర్షక విప్లవాభివృద్ధిని కుంటుపరచి స్వప్రయోజనములను సాధించుకొను కులక్కుల యీప్రయత్నమును ప్రథమ సోవియటు కాంగ్రెస్ విప్లవ వ్యతిరేకమైన ప్రయత్నముగా పరిగణించి, అట్టి దారుణ

మైన వారి ప్రయత్నమును తీవ్రముగా ఎదిరించాలి. వివిధ గ్రామముల స్థానిక ప్రత్యేక పరిస్థితుల ననుసరించి స్థానిక సోవియట్లు ఆయా గ్రామముల బీద, మధ్యతరగతి రైతుల ప్రయోజనముల కనువైన భూవిభజన విధానము నమలునందుంచాలి. శ్రమ ప్రమాణము ననుసరించిగాని, వినియోగము ననుసరించిగాని (అనగా ఒకవ్యక్తి స్వంతశ్రమతో సాగుచేయుకలిగిన భూవ్రతి నిచ్చుటగాని, తన కుటుంబమునకు, తనజీవనమునకు సరిపడు గ్రాసము నొసగు భూప్రతినిచ్చుటగాని) లేక యీ రెండు సూత్రముల ననుసరించిగాని భూవిభజన జరగాలి. లేక బీద, మధ్యతరగతి రైతులకు, వ్యవసాయకూలీలకు కుటుంబసంఖ్య ననుసరించి సమముగాను, కులకర్ల శ్రమశక్తి ననుసరించియు భూమిని పంచాలి. అనగా కుటుంబసంఖ్య ననుసరించి సమానముగా ప్రదేశములలో పనిచేయుశక్తికలిగిన ప్రతి కులకర్త ఒక కుటుంబసభ్యుడు పొందునంత భూమిని పొందుతాడు. భూవిభజన ఒక్క పరిమితి ననుసరించియే కాక, సారమును, ముఖ్యముగా ఫలసాయము ననుసరించి జరగాలి. అంతేకాక భూమిని విభజించుటలో భూముల మధ్యగా రోడ్లువేయుట మొదలైన భూస్వామిక యుగపు చిహ్నములను తొలగించుట మొదలైన అవసరమైన సవరణలన్నీ ఆచరణలో పెట్టాలి.

——(o)——

# కార్మిక శాసనం.

(ప్రథమ అఖిల చైనా సోవియట్ కాంగ్రెస్ ఆమోదించిన సాధారణ నియమములు.)

నిబంధన 1:—పారిశ్రామిక సంస్థలలోగాని, కర్మాగారములలోగాని, వ్యాపారఉత్పత్తి సంస్థలలోగాని, ప్రభుత్వ, సహకార, వ్యక్తిగత సంస్థలు మొదలైన సంస్థలలోగాని కూలికి పనిచేయు వ్యక్తుల కందరకూ యీకార్మికశాసనం వర్తిస్తుంది.

నిబంధన 2:—చైనా సోవియట్ ప్రజారాజ్యములో భూతల, నావిక, వైమానిక సంస్థలలో పనిచేయుచున్న సాధారణసైనికులకుగాని, వారికమేండర్లకుగాని యీకార్మిక శాసనం వర్తించదు.

నిబంధన 3:—ఇంతకు పూర్వమే అమలునందున్నట్టిగాని, యికముందమలు లోనికి రాబోవునట్టిగాని, కంట్రాక్టువను లు మొదలైన సామూహిక కార్మిక ఒడంబడికలన్నీ ప్రస్తుత కార్మిక శాసనము ప్రకారము కార్మికులకు కలుగజేయవలసిన వసతులన్నీ కలుగచేయక పోయినచో యిపుడు రద్దు చేయబడతాయి.

నిబంధన 4:—ఈకార్మిక శాసనములోని సాధారణనియమములే కాక ప్రత్యేక పరిస్థితులలో పనిచేయు వ్యవసాయ కూలీలు, అటవీ కార్మికులు, వరుణములలోను ఋతువులలోను పనిచేయు కూలీలు, రహదారి కూలీలు, గృహకృత్యములు నిర్వర్తించు కూలీలు, వంటవానుష్యులు మొదలైన వ్యక్తుల

పంతులను గురించి కేంద్ర కార్మిక నిర్వాహక వర్గము చేతను, ప్రజామంత్రుల సమితి చేతను, కేంద్ర కార్మిక మంత్రివర్గము చేతను, ప్రత్యేక నియమములు జారీ చేయబడును.

నిబంధన 5:—ఎగుమతి దిగుమతి కూలీలు, మోతకూలీలు, పడవకూలీలు, బరువు వేసిన బండ్లను లాగుకూలీలు, పల్లకీలు, డోలీలు మోయుకూలీలు, హార్బరు కూలీలు మొదలైన కూలీలు మోయదగిన బరువుల పరిమితిని కూడ కేంద్ర కార్మిక మంత్రివర్గమే నిర్ణయించును. స్వతంత్ర కష్టజీవులు కూలికైన నిచేయు సప్పుడు, ప్రస్తుత కార్మిక శాసనములోని హక్కులను రక్షణలను వారు కూడ పొందునట్లు కేంద్ర కార్మిక మంత్రివర్గమే వివరమైన నిర్ణయములు చేయును.

## 2 కంట్రాక్టు పనివారిని గురించిన వివరములు

నిబంధన 6:—సాముదాయక ఒడంబడికలలోని నియమముల ననుసరించియు, కార్మిక సంఘములు, పనిమార్పు కార్యాలయముల ద్వారాను కూలీలు కంట్రాక్టు చేయబడరాదు. కూలీలు కంట్రాక్టరులు, ఏజెంట్లు, మేస్త్రీల ద్వారా వ్యక్తిగతంగా గాని, వ్యక్తిగత సంస్థల ద్వారా గాని పనులలో నియమింపబడుట పూర్తిగాని షేధింపబడినది.

నిబంధన 7:—పనిమార్పు కార్యాలయన్నీ కార్మిక మంత్రివర్గము చేతనే నెలకొల్పబడి నడుపబడతాయి. కార్మికులను వ

నిలోకి జేర్చు వ్యక్తిగత సంస్థలు, కార్యాలయాలు అన్నీ నిషేధింప బడతాయి.

నిబంధన 8:—కూలీలకు పని చూపినందుకు గాను ప్రతిఫలముగా ధనము గైకొనుట గాని, వారి జీతములో కొంత భాగమును మినహాయించుకొనుటగాని చట్టవిరుద్ధముగా యెంచబడుతుంది. ఈ నిషేధమును వ్యతిరేకించువారు తీవ్రముగా శిక్షింపబడతారు.

నిబంధన 9;—పనికోరు ప్రతివ్యక్తి కేంద్ర కార్మికమంత్రివర్గముచే నడిపింపబడు పనిమార్పు కార్యాలయములో గాని, దాని స్థానిక శాఖలోగాని తన పేరును జాబితాలో నమోదు చేయించుకోవాలి.

# 3 సాముదాయక ఒడంబడికలు, కూలీ కంట్రాక్టులు

నిబంధన 10:—సాముదాయక ఒడంబడిక అంటే ఒక పారిశ్రామిక సంస్థలోని కార్మికులకు ఇతర ఉద్యోగులకూ ప్రతినిధిగా కార్మిక సమితికీ, ఆసంస్థ యజమానికీ మధ్య జరుగు కంట్రాక్టు (ఒడంబడిక) అన్నమాట. సాముదాయక ఒడంబడికలో పారిశ్రామిక సంస్థలలోగాని, వ్యక్తులక్రిందగాని, కూలికి పని చేయుచున్నట్టి, యికముందు జేరబోవునట్టి కూలీలు ఉండవలసిన షరతులు ఉల్లేఖింప బడతాయి.

నిబంధన 11:—సాముదాయక ఒడంబడికలోని షరతులు

న్నీ ఆయా పారిశ్రామిక సంస్థలలోని వ్యక్తులందరి విషయంలో వారు కార్మిక సంఘ సభ్యులైనా కాకపోయినా అమలు నంటాయి.

నిబంధన 12:—కేంద్రకార్మిక మంత్రివర్గపు కార్యాలయంలో రిజిష్టరు చేయబడిన సాముదాయక ఒడంబడికలన్నీ వెను వెంటనేగాని, ఒడంబడికలో వుదహరించబడిన దినమునుండీగాని అమలులోనికి వస్తాయి.

నిబంధన 13:—కూలీ కంట్రాక్టు (లేక ఒడంబడిక) అనగా ఒక లేక కొందరు కార్మికులకు, యజమానికి మధ్యజరుగు ఒడంబడిక. కార్మిక ఒడంబడికలోని ఏషరతైనా కార్మిక శాసనములోని, లేక ఆచరణలో నున్న యేకార్మిక నిర్ణయములోని లేక సాముదాయక ఒడంబడికలోని నియమములకు, నిర్ణయములకు విరుద్ధముగా నున్నయెడల వెంటనే అది రద్దవుతుంది. ఏ సాముదాయక ఒడంబడికయు ఒక సంవత్సరకాలముకన్న అధికముగా అమలులో నుండదు. ఒడంబడికలో ఉదహరించబడిన నిర్ణీతకాలమునకు ముందుగానే అదిరద్దు అగునట్లు కోరుటకు కార్మిక సంఘమును హక్కును కలిగి యుంటుంది.

## 4 పనికాలం

నిబంధన 14:—ప్రస్తుత కార్మిక శాసనము ననుసరించి కూలికిపనిచేయు ఏవ్యక్తియు దినమున కెనిమిది గంటల సామాన్యకాలముకన్న అధికముగా పనిచేయరాదు

నిబంధన 15—16 నుండి 18 ఏండ్లప్రాయముగలయు

వకులెవ్వరూ రోజున కారుగంటల పనికన్న అధికముగా పని చేయరాదు. 14 నుండి 16 ఏండ్ల వయస్సుగల బాలుర రోజుపని నాలుగు గంటలను మించి యుండరాదు.

నిబంధన 16:—ప్రమాదకరమైనట్టియు, ఆరోగ్యమును భంగపుకలిగించు నట్టియు పరిశ్రమలలో (ఉదాహరణకు భూగర్భస్థమైన గనులలోను ఉక్కు, తగరము మొదలైన ప్రమాదకరమైన వస్తువులకు సంబంధించిన పరిశ్రమలలోను) పని చేయు కార్మికుల పనికాలము ఆరుగంటలకు గాని, అంతకన్న తక్కువకు గాని తగ్గించవలెను. ఆరోగ్యమునకు భంగము కలిగించునట్టి వివిధపరిశ్రమల పేర్లను, ఆయా పరిశ్రమల కార్మికుల పనికాలములో తగ్గింపును కేంద్ర కార్మికవర్గము నిర్ణయించి ఒక జాబితాను ప్రకటిస్తుంది.

నిబంధన 17:—రాత్రి పనిచేయు కార్మికుల పనికాలము, పగలు పనిచేయువారి పనికాలముకన్న ఒకగంట తక్కువగా వుంటుంది. (సామాన్యంగా పనిచేయు కాలము 8 గంటలైతే 7 గంటలకు, 6 గంటలైతే 5 గంటలకు తగ్గించబడుతుంది.)

వరా:—రాత్రి 9 గంటలనుండి ఉదయము 6 గంటలవరకు చేయబడిన పని రాత్రిపనిగా పరిగణింపబడుతుంది.

నిబంధన 18:—కార్మిక అజమాయిషీ సమితులనుండి గాని, కార్మిక సంఘములనుండిగాని (ప్రత్యేకించి) ముందుగా అనుమతిని తీసుకొన్న ప్రత్యేక పరిస్థితులలోతప్ప యే పారిశ్రామిక శాఖలోగాని, యే తరుణపు పనులలోగాని, కార్మికశాసన

ములోని నిర్ణీతకాలముకన్న అధికముగా పని చేయించరాదు.

## 5 విశ్రాంతి కాలము

నిబంధన 19:—ప్రతికార్మికునకు వారములో 42 గంటలకు తక్కువ కాకుండా పని చేసిన తరువాత యెట్టి పరిస్థితులలోనైనా సరే తప్పకుండా ఒకరోజు విశ్రాంతి లభిస్తుంది.

నిబంధన 20:—ఏ పారిశ్రామిక సంస్థలోగాని విడువకుండా అరు నెలలకన్న అధికంగా పనిచేసిన ఏవ్యక్తికైనా ఏడాదికి పూర్తిజీతంతో కనీసము రెండు వారముల శెలవు లభిస్తుంది. ప్రమాదకరమైన పరిశ్రమలలో పని చేయు కార్మికులు పూర్తిజీతముతో ఏడాదికి నాలుగువారముల శెలవును పొందుతారు.

నిబంధన 21:— ఈ క్రింది ఉత్సవ దినాలనాడుగాని, శెలవు దినములనాడుగాని పని చేయుట చట్టవిరుద్ధము: జనవరి 1—సంవత్సరాది; జనవరి 21—లెనిన్ దినోత్సవం (ప్రపంచ విప్లవ నాయకుని మరణదినోత్సవం); ఫిబ్రవరి 7—పెకింగ్-హాంకో రైల్వే కార్మికుల (సైనికవాదులచే) కాల్పుల దినం; మార్చి 18—పారిస్ కమ్యూన్ దినోత్సవం; మే 1—అంతర్జాతీయకార్మిక దినోత్సవం (మే. డే); మే 30— 1925 లో జరిగినషాంఘై ఘటనల దినోత్సవం; నవంబరు 7—సోవియట్ యూనియన్‌లో జరిగిన కార్మిక విప్లవ దినోత్సవం; చైనా సోవియట్ ప్రజారాజ్య స్థాపనదినోత్సవం; డిశంబరు 11—కాంటన్ తిరుగుబటుదినం.

ఇ.రా:—ఆయా ప్రాంతములలోని ప్రత్యేక పరిస్థితుల నను సరించి ప్రాంతీయ కూలీ సంఘములు, కార్మిక సమితులతో యోజించి కొన్ని శెలవలను, విశ్రాంతి దినములను ప్రత్యేకముగా యివ్వవచ్చును. కాని శెలవు రోజులకు, విశ్రాంతి దినములకు తప్పక పూర్తి జీతమివ్వాలి.

నిబంధన 22:—విశ్రాంతి దినములకుగాని, శెలవురోజులకుగాని, ముందరిరోజున పనికాలము 6 గంటలకు మించియుండరాదు.

నిబంధన 23:—ప్రస్తుత కార్మిక శాసనము ప్రకారము నిర్ణయింపబడిన పనికాలములో ఒక అరగంటగాని, గంటగాని భోజనము చేయుటకై కూలి నష్టములేకనే విశ్రాంతి యొసగబడుతుంది.

నిబంధన 24:—పారిశ్రామిక కార్మికులకు, యితర పనివారికి జబ్బుకాలములోగాని, ప్రసూతి సమయములోగాని యివ్వబడిన లీవు మూలముగా ఏడాదిలో వారికి నిబంధన 2[illegible] ప్రకారము పూర్తి జీతముతో లభించవలసిన శెలవు పరిమితి తగ్గింపబడదు.

## 6 కూలి

నిబంధన 25:—కార్మిక మంత్రివర్గము వారిచే నియమింపబడిన కనీస వేతనము కన్న ఏ కార్మికునకూ తక్కువ కూలి నివ్వరాదు. ప్రతి మూడు నెలలకూ ఒకమారు వివిధపారిశ్రామిక శాఖలలోని కార్మికుల కనీస వేతనములు కార్మిక మంత్రివర్గముచే పునః పరిశీలింప బడతాయి.

నిబంధన 26:—ఆచరణలో ప్రభుత్వ సహకార, వ్యక్తిగత పారిశ్రామిక సంస్థలన్నింటిలోని కార్మికుల వేతనములూ ఆయా సంస్థల (కార్మిక సంఘప్రతినిధులైన) కార్మికుల, యజమానుల సమిష్టి ఒడంబడికలలో నిర్ణయింపబడతాయి.

నిబంధన 27:—కార్మిక అజమాయిషీ సంఘముల, కార్మిక సంఘముల అనుమతిపై నిర్ణీతకాలముకన్న అధికముగా చేయించు ను పనికి మామూలు కూలికన్న రెట్టింపుకూలి నివ్వాలి.

నిబంధన 28:—కార్మిక అజమాయిషీ సంఘముల, కార్మికసంఘముల అనుమతిపై కార్మికుల విశ్రాంతి దినములలో గాని, శెలవు దినములలో గాని చేయించుకొనుపనికి మామూలు కూలికి రెట్టింపు కూలినివ్వాలి.

నిబంధన 29:—ఒకపనిలో నియమింపబడిన మొగకూలీలు చేయుచుండిన పనిని అదేపనిలో నియమింపబడిన ఆడకూలీలుగాని, యువకులుగాని చేసినట్లయితే వారికికూడ మొగకూలీల కివ్వబడు వేతనము లభిస్తుంది. యువకుల, బాలుర, కనీసపని కాలము తక్కువైనప్పటికీ, ఆపారిశ్రామిక శాఖలో అమలులోనున్నట్టి పూర్తి వేతనము వారికివ్వబడుతుంది.

నిబంధన 30:—సాధారణ వేతనముకన్న రాత్రిపనికి అధిక వేతన మివ్వబడుతుంది. రాత్రిపూట 8 గంటలు పనిచేయు కార్మికునకు సాధారణ వేతనముకన్న 1/7 వ వంతు అధిక వేతన మివ్వబడుతుంది. 6 గంటలు (ప్రమాదకరమైన) పని చేయువా

రికి సాధారణ వేతనముకన్న 1/5 వ వంతు అధిక వేతన మివ్వబడు తుంది. రాత్రిపూట మస్తావనులు చేయు 8 గంటల పనివారికి వారి మామూలు కూలికన్న 1/7 వ వంతున్ను, 6 గంటలపని వారికి 1/5 వ వంతున్ను కూలిఅధికముగా యివ్వబడుతుంది.

నిబంధన 31:—కార్మికుల కివ్వవలసిన కూలి (వస్తురూపములో కాక) ధనరూపములో ప్రతివారముగాని, నెలకు రెండు మారులుగాని (నెలకు రెండుమారులు తక్కువ కాకుండా) యివ్వబడుతుంది. వేతనము లిచ్చుటలో ఆలస్యము చేయుటకూడ తీవ్రముగా నిషేధింపబడుతుంది. వేతనము లన్నీ కార్మికులకే స్వయముగా అంద చేయబడాలి.

నిబంధన 32:—పారిశ్రామిక కార్మికులకు, యితర పని వారికి ప్రతి ఏడాదీ యివ్వబడు శెలవుల కివ్వవలసిన వేతనములు శెలవుల ఆరంభములోనే వారికివ్వబడుతాయి.

నిబంధన 33:—మస్తా పనులకు కూలి (కార్మికసంఘప్రతినిధులద్వారా) కార్మికుల, యజమానుల మధ్యజరుగు సమిష్టి ఒడంబడికద్వారా నిర్ణయింప బడుతుంది. మస్తాపనులకు కూలి రోజుకు చేయబడు పని పరిమితిని బట్టియు, సాధారణముగాయిచ్చు కూలిని బట్టియు, ఆయా పరిశ్రమలలో, ఆయా వస్తువులను తయారుచేయుటకు పట్టుకాలమును బట్టియు నిర్ణయింపబడాలి.

## 7 స్త్రీలు, యువకుల, బాలుర పని.

నిబంధన 34:—కార్మిక శాసనంలో కార్మిక స్త్రీల, యువకుల, బాలురహక్కులను వివరిస్తూ సమగ్రంగా చేయబ

డిన సాధారణ నియమములతోడు యీక్రింది ప్రత్యేక నియమములుకూడ అమలులో నుంచబడతాయి.

నిబంధన 35:—అతిభారమైన, ఆరోగ్యమునకు భంగకరమైన, పారిశ్రామిక శాఖలలో స్త్రీలు, యువకులు, బాలురు పనిచేయరాదు. స్త్రీల, యువకుల, బాలుర పని నిషేధింపబడిన పరిశ్రమల జాబితా కేంద్రకార్మిక మంత్రివర్గము తయారుచేసి ప్రకటిస్తుంది. (ఈజాబితాలో భూగర్భంలో గనులలో పని చేయుట,రబ్బరు, ఉక్కు, రాగి, పాదరసములతో పనిచేయుట, ఫౌండ్రీలలో (లోహములనుపోతపోయు కర్మాగారములలో)పని చేయుట, మొదలైనవి వుంటాయి.)

నిబంధన 36:— 40 పౌనులకన్న హెచ్చుబరువు మోయవలసివచ్చు పనులను స్త్రీలు చేయరాదు. అట్టి బరువులను మోయుట తప్పని సరియైన పరిశ్రమలలో పనిచేయు స్త్రీలుసాధారణ పనికాలంలో 2/3 వ వంతు కాలముకన్న ఎక్కువ పని చేయరాదు.

నిబంధన 37:—18 ఏండ్లవయస్సు కలిగిన స్త్రీలుగాని, పురుషులుగాని, గర్భిణీ స్త్రీలుగాని, చంటిబిడ్డల తల్లులుగాని రాత్రిపూట పనిచేయుట పూర్తిగానిషేధింప బడినది.

నిబంధన 38:—శరీరకష్టముచేయు స్త్రీలు ప్రసవకాలమునకు పూర్వమును, తదనంతరమును, మొత్తమ్మీద పూర్తిజీతములో 8 వారముల సెలవును పొందుతారు. మానసిక కష్టముచేయు స్త్రీలు (ఉదాహరణకు స్త్రీ మేనేజర్లు,కార్యదర్శినులు

ముదరైనవారు) ప్రసవమునకు ముందును, తరువాతను పూర్తి జీతముతో 6 వారముల శెలవును పొందుతారు. గర్భస్రావము తదుపరి కార్మిక స్త్రీలకు పూర్తిజీతముతో శలవుయివ్వబడుతుంది.

షరా:—ప్రసవమునకు ముందును, తరువాతను, గర్భస్రావమునకు తరువాతను యివ్వబడు శలవు కాలమునకు యివ్వవలసిన జీతమును ఆపారిశ్రామిక సంస్థవారే యిస్తారు. సాంఘిక భీమా పద్ధతి అమలునందున్న చోట్ల భీమా కార్యాలయము వారు యిస్తారు.

నిబంధన 39:—ప్రసవమునకు ముందు 5 నెలల కాలంలోను, తరువాత 9 నెలల కాలంలోను స్త్రీ కార్మికులను పని నుండి తొలగించరాదు. అంతేకాక అట్టి స్త్రీ కార్మికులు వారి యిష్టవ్యతిరేకముగా యితర పారిశ్రామిక సంస్థలలోనికి బదిలీ చేయబడరాదు

నిబంధన 40:—పసిబిడ్డల తల్లులైన స్త్రీ కార్మికులకు ప్రతిమూడు గంటలకు ఒకసారి తమ బిడ్డలకు పాలనిచ్చుటకు ఒక అరగంట లీవు యివ్వబడుతుంది. ఈలీవు 23-వ నిబంధన ప్రకారము సాధారణముగా అందరికీ యివ్వబడు విశ్రాంతితోడుగా వీరికి అధికముగా జీతములో కోత లేకుండా యివ్వబడుతుంది. ప్రతి పారిశ్రామిక కార్యాలయములోను శిశువులకు పాలిచ్చేటందుకు ఒకగది ప్రత్యేకించబడుతుంది. ఆపారిశ్రామిక సంస్థ బాధ్యతపై ప్రత్యేకముగా నియమించబడిన నౌకర్లు ఆశిశువుల గదిలో పనులు చూస్తూ వుంటారు.

నిబంధన 41:—14 ఏండ్లుకన్న తక్కువ వయస్సుగల బాలురచేత పనిచేయించుట పూర్తిగా నిషేధింపబడినది. 14, 16, ఏండ్ల మధ్య వయస్సుగల బాలురను కార్మిక అజమాయిషీ సంఘమువారు పరీక్షచేసి తమఅంగీకారము యిచ్చిన తదుపరి మాత్రమే పనిలో చేర్చుకోవాలి.

నిబంధన 42:—ప్రతి పారిశ్రామిక కార్యాలయంలోను ఆపారిశ్రామిక సంస్థలో పనిచేయు యువకుల పేర్లను, వారి వారి వయస్సులను, పనికాలపు గంటలను, వేతనములను సూచిస్తూ ఒకవివరమైన, సమగ్రమైన జాబితాను తయారుచేయాలి.

నిబంధన 43:—14 నుండి 18 ఏండ్ల మధ్యవయస్సుగల బాలుర, యువకుల విద్యా, విజ్ఞానముల అభివృద్ధిని సాధించుటకు ప్రతి ఫ్యాక్టరీలోను, కొట్టులోను ప్రత్యేక తరగతులు నడుపబడాలి. అట్టి తరగతులకు అగు ఖర్చంతయు ఆ పారిశ్రామిక సంస్థయే భరించాలి.

పాతపద్ధతి (అప్రెంటిస్‌షిప్పు) "కార్మిక తరిఫీయతు" పూర్తిగా నిషేధింపబడుతుంది. కార్మిక శాసనములోని పనిగంటలు వేతనములు సౌకర్యములు మొదలైనవానికన్న అధమమైన షరతులతో అప్రెంటిసులతో (పనినేర్చుకొనువారు) చేసికొన్న ఒడంబడికలన్నీ రద్దుచేయబడతాయి.

# 8 కార్మికరక్షణ.

నిబంధన 44:—పనిచేయు ప్రదేశమును కార్మిక అజమాయిషీ సంఘమువారు ముందుగా పరీక్షించి అనుమతించిన గాని ఏపారిశ్రామిక సంస్థయు ఒకచోట పనిప్రారంభించుటగాని, వేరొకచోటుకు మారుటగాని చేయరాదు.

నిబంధన 45:—యంత్రాలన్నిటికీ తగురక్షణలు కల్పించబడతాయి. తగినకార్మిక అజమాయిషీ సంఘంచే ముందుగా పరీక్షింపబడి, తగురక్షణలు కల్పింపబడిన తరువాత గాని క్రొత్త యంత్రముతో పనిచేయరాదు.

నిబంధన 46:—పారిశ్రామిక సంస్థలన్నింటిలోనూ ప్రత్యేక కార్మిక దుస్తులు కార్మికులకు సరఫరా చేయబడతాయి. ఏ పారిశ్రామిక శాఖలోని కార్మికులకెట్టి దుస్తులివ్వవలెనో, ఎంతెంతకాలమునకొక్కొక్క మారివ్వవలెనో కేంద్ర కార్మికవర్గమువారు ప్రత్యేకముగా నిర్ణయిస్తారు.

నిబంధన 47:—కార్మికుల ఆరోగ్యమునకు భంగకరమైనవియును, ప్రాణాపాయకరములును, (విపరీతమైన శీతోష్ణములు, విషవాయువులు) అయిన పారిశ్రామిక సంస్థల అధికారులు వానిలో పనిచేయు కార్మికులకు ప్రత్యేకరక్షణ నిచ్చుదుస్తులు, కళ్లజోళ్లు, తొడుగులు, రెస్పిరేటర్లు (దుమ్ము, విషవాయువులు పీల్చిన గాలితో పాటు లోనికిపోకుండ నిరోధించు సాధనములు) మొదలైన ప్రమాదనిరోధక సాధనములు, సబ్బులు, వెన్న,

పాలు మొదలైన ఆహార పదార్థములు కలుగజేయాలి. కార్మి కులకు విషములు తగులు పారిశ్రామిక సంస్థలలో ఆయా విష ములకు విరుగుళ్లను కూడ సిద్ధముగా వుంచాలి. ఈపరికరము లున్వయముగా తెచ్చుకోవలసిన బాధ్యత కార్మికులకు లేదు. అంతేకాక ఆకార్మికులందరకూ నిర్ణీతకాలములందు వైద్యపరీ క్షను చేయించాలి.

నిబంధన 48:—జీతమునుండి జరిమానాలుగాని, పెనా ల్టీలుగాని తగ్గించియిచ్చుట పూర్తిగా నిషేధించబడింది. అదేవి ధంగా ఏమైనా పగుల కొట్టినందుకుగాని, తక్కువరకపు పని చేసినందుకుగాని పరిహారముగా జీతములో ఏమియు తిరుగకో యరాదు, ఒకమారు పనిలో చేర్చుకోబడిన తరువాత, ఎంతకాల మైనాసరే కార్మికులనుండి జామినుగా ధనమునుగాని ఏవిధమై న ధరావతునుగాని తీసికొనుట పూర్తిగా నిషేధించబడినది.

నిబంధన 4':—(యంత్రములు పాడగుట వలనగాని, ముడిసరుకుల అభావం వలనగాని, సోవియట్ ప్రభుత్వ శాసన ములను యజమాని అమలుపరచ నిరాకరించుట వలనగాని, యి ట్టి యేయితర కారణముల వలనగాని) యజమాని బాధ్యతలో పని ఆపుచేసిన కాలమునకు కార్మికుల జీతమును తగ్గించరాదు.

నిబంధన 50:—సోవియట్లకు జరుగు ఎన్నికలలో పా ల్గొనుటకుగాని, సోవియట్ కాంగ్రెస్సులకు, ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్సులకు, సమావేశములకును హాజరగుటకుగాని, కర్మా గారసమితుల పనివలనగాని, సమనుల ప్రకారం సాక్షులుగాను,

నిపుణులుగాను, అప్రెంటిస్లుగాను కోర్టుకు హాజరగుటకుగాని పని నుండి గైరుహాజరైన కార్మికుల జీతములను వారావిధము గా యెంతకాలము పనినుండి గైరుహాజరై నప్పటికి తగ్గించి యివ్వరాదు.

నిబంధన 51:—ఎయిర్ సైన్యములో చేర్చుకొనబడుట మూలముగా వుద్యోగమును కోల్పోయిన కార్మికులకుగాని, యితర వుద్యోగస్థులకుగాని మూడునెలల జీతము ముందుగా యివ్వ బడుతుంది.

నిబంధన 52:—కార్మికులకు వుత్పత్తి పరికరాలను యజమానియే సరఫరా చేయాలి. అవియిచ్చినందుకుగాను ప్రతి ఫలముగా కార్మికుల జీతమును తగ్గించరాదు. కార్మికులు తమ స్వంత పనిముట్లను వాడుచోట్ల వాటిఅసలు ఖరీదును యజమాని వారికివ్వాలి. ఈవిషయమై సామూదాయిక ఒడంబడికలో విస్పష్టంగా పేర్కొనబడుతుంది.

నిబంధన 53:—కార్మికులు, వారికుటుంబముల వారు నివసించుటకుగాను నమూనాగా యుండ్లను పారిశ్రామిక సంస్థవారే స్వంతఖర్చుపై కట్టించి ఉచితంగాయివ్వాలి. కార్మికులకు నిర్దేశిత స్థలములను కట్టించి యివ్వని పారిశ్రామిక సంస్థలవారు నెలవారీగా వారికి యింటిఅద్దెకుగాను కొంతసొమ్ము నివ్వాలి.

నిబంధన 54:—అధికారము పొందకుండా ఏయజమాని అయినా సాముదాయిక ఒడంబడికను రద్దుచేసి సట్లయితే కో[illegible]

పని వెతుక్కునేలోపుగా రెండు వారాల జీతమును పరిహారము గా కార్మికుల కివ్వాలి. (సోవియుట్ జిల్లాల ఆర్థికపరిస్థితిని ధ్వంసము చేయుటకుగాను యజమానులు తమపారిశ్రామిక సంస్థలను మూసివేసి, కార్మికులు, యితర వుద్యోగులు "తమంతట తామే" పనిని మానుకొనునట్లు ఒత్తిడి తెచ్చేవారు. అట్టిపరిస్థితుల నెదుర్కొనుటకు పైనిబంధన శాసనములో జేర్చబడింది).

నిబంధన 55:—కార్మికులు గాని, యితర వుద్యోగులు గాని తాత్కాలికముగా పనిచేయుటకు అశక్తులయి నట్లయితే వారివారి స్థానములను ఖాళీగావుంచి యజమానుని వారి పూర్వపు మామూలు జీతము నివ్వాలి.

నిబంధన 56:—కార్మిక శాసనమును ఎంతవరకు అమలుపరచుచున్నదీ పరీక్షించి ఏపారిశ్రామిక సంస్థలోనైనా కార్మికుల ఆరోగ్యముగాని, ప్రాణములుగాని ప్రమాద పరిస్థితిలో నున్నట్లయితే ఆపారిశ్రామిక సంస్థలను కార్మిక యిన్స్పెక్టర్లు వెంటనే మూయించి వేయవచ్చును. కార్మిక యిన్స్పెక్టర్ల బాధ్యతలను, విధులను కార్మిక మంత్రివర్గమువారు అనుబంధముగా ప్రచురిస్తారు.

నిబంధన 57:—ఏ కార్మికునకైనా అతను పనిజేయు కాలములోవచ్చు ఎట్టిరోగమునైనా ప్రస్తుత శాసనము ప్రకారము పారిశ్రామిక అపాయముగా పరిగణించి దానికి పూర్తి పరిహారము నివ్వాలి.

# 9 అఖిల చైనా కార్మిక సమాఖ్య, దాని స్థానిక శాఖలు.

నిబంధన 58:—చైనా దేశమంతటా గల పారిశ్రామిక సంస్థలలోని ఇతర సంస్థలలోని, కార్మికులను, ఇతర వుద్యోగులను అఖిల చైనా కార్మిక సమాఖ్య (ఫెడరేషన్) సమైక్య పరుస్తుంది. అన్ని కార్మికసంఘములు వాటి స్థానిక శాఖలూ అఖిల చైనా కార్మిక సంఘమహాసభ (కాంగ్రెస్సు) లో తీర్మానించబడిన సూత్రముల ప్రకారము పనిచేస్తాయి. ఇతర విధములుగా పనిచేయు ఏయితర సంఘానికూ, పైసంఘములకు శాసనరీత్యా లభించు అవకాశములుగాని, అధికారములుగాని లభించవు.

నిబంధన 59:—సోవియట్లు కార్మిక సంఘములకు నిర్మాణ స్వాతంత్ర్యము నిస్తాయి. ఆసంఘములకు సమ్మెలను ప్రకటించి, నడుపుటకును, కార్మికుల తరఫున సాముదాయిక ఒడంబడికలను చేసికొనుటకు సంపూర్ణాధికారముంటుంది. రాష్ట్ర కార్మిక సమితులకు, ప్రత్యేక పారిశ్రామిక శాఖా సమితులకు ప్రత్యేక ప్రదేశములోని కార్మికులందరి తరఫునగాని, ప్రత్యేక పారిశ్రామిక శాఖలోని కార్మికులందరితరఫునగాని సాముదాయిక ఒడంబడికలు చేసికొనహక్కు వుంటుంది.

నిబంధన 60:—పారిశ్రామిక సంస్థలలో కార్మికసంఘములకు ప్రధానాంగములుగా పనిచేయు ఫేక్టరీ, షాపు సమితు

శే సాముదాయక, కార్మిక ఒడంబడికలన్నిటినీ అమలుపరుచుతాయి. కార్మిక శాసనము, తదితర కార్మిక నిర్ణయములన్నీ కూడ అమలుజరుగునట్లు సంఘములు చూస్తాయి.

నిబంధన 61:—వ్యక్తిగతంగాను, సాముదాయకంగాను కార్మికులకు ప్రాతినిధ్యము వహించుట, కూలికైపని చేయు వ్యక్తులందరి ప్రయోజనములను పరిరక్షించుట, కార్మికుల ఆర్థిక వైజ్ఞానికాభివృద్ధికై కృషిచేయుట, సోవియట్ వుద్యమానికీ సోవియట్ ప్రభుత్వానికీ దృఢపడి వ్యాప్తిచెందుటలోను, వాటి రక్షణలోను సాధ్యమైన కార్యరూపమైన ప్రోత్సాహమంతయు చేయుటయు కార్మిక సంఘముల ప్రధానబాధ్యతలు.

నిబంధన 62:—ప్రభుత్వ, సహకార, పారిశ్రామిక సంస్థల యాజమాన్యములో కార్మిక సంఘములు ప్రత్యక్షముగా పాల్గొంటాయి. వ్యక్తిగత పారిశ్రామిక సంస్థలలో పరిశ్రమల యాజమాన్యముకై కార్మికసంఘముల తరఫున ప్రత్యేకసమితులేర్పడిపనిచేస్తాయి.

నిబంధన 63:—తంతి, టపా, టెలిఫోను వార్తలు పంపుటకు, విద్యుద్దీపములకు, నీటిసరఫరాకు, రాకపోకలకు, రైళ్లకు, ఓడలకు, తగ్గింపుధరలద్వారా సోవియట్ ప్రభుత్వం కార్మిక సంఘాలకు సహాయముచేస్తుంది.

నిబంధన 64:—యజమాని కూలి రూపములో యిచ్చు మొత్తము ధనములో 2% కార్మిక సంఘఖర్చులకు, 1% కార్మికుల వైజ్ఞానికావసరములకును ప్రత్యేకించి యివ్వాలి.

నిబంధన 65:—మజదూరుని ఒక కార్మికుని పని లోనుండి తొలగించ దలచినపుడు కార్మిక సంఘం అనుమతిని సంపాదించాలి. కార్మికులకు, పెట్టుబడిదారులకు మధ్య సంభవించు తగాదాలను పరిష్కరించుటకు గాను ఏర్పడుత గాదా పరిష్కార సమితులలో కార్మికుల ప్రతినిధి సంస్థలైన కార్మిక ఫేక్టరీ, షాప్ సమితులు సభ్యత్వార్హతను పొందుతాయి.

నిబంధన 66:—అతి చురుకైన ముగ్గురునుండి ఏడుగురు కార్మికులతో ప్రతి పారిశ్రామిక సంస్థలోను ఫేక్టరీ సమితి ఒక కార్మిక రక్షణ సంఘము నేర్పరుస్తుంది వాటి బాధ్యత లీవిధంగా వుంటాయి.

(అ) కార్మిక శాసనములోని, సాముదాయిక ఒడంబడికలలోని కార్మిక సంరక్షణను సంబంధించిన నిబంధనలన్నీ అమలు జరుగునట్లు చూచుట.

(ఆ) కార్మిక యిన్స్పెక్టర్ల ఆజ్ఞలు, సూచనలు అమలు జరుగునట్లు చూచుట.

నిబంధన 67:—సోవియట్ ప్రభుత్వమునకు, కార్మికులకు సంబంధించిన సూచనలను చేయుటకు, కార్మిక ఇన్స్పెక్టర్లను సిఫారసు చేయుటకు, ఎన్నుకొనుటకు కార్మిక సంఘములకు హక్కున్నది. ఫేక్టరీ సమితి సభ్యులు లేక ఫేక్టరీ సమితి యోగ్యతాపత్రములను చూపి ఏవిధమైన అభ్యంతరము లేకుండా ఫేక్టరీ ఆవరణాలలో యే ప్రదేశములోనైనను ప్రవేశించి పరీక్షించ వచ్చును.

# 10 సాంఘిక భీమా.

నిబంధన 68:—ప్రభుత్వ, సహకార, వ్యక్తిగత, పారిశ్రామిక సంస్థలలో వేనిలో పనిచేయు కార్మికులకైనా వారిపని కాలములోని వ్యత్యాసములతోను అధిక, అల్ప వేతనములతోను సంబంధము లేకుండా సాంఘికభీమా అనువర్తిస్తుంది.

నిబంధన 69:—కార్మికుల వేతనములకు తోడు అజీతవముల మొత్తములో 10% నుండి 15% వరకు యజమానులు సాంఘిక భీమా ఫండుగా యివ్వాలి.

షరా:—ఎట్టిపరిస్థితులలోనూ సాంఘికభీమాకై ప్రత్యేకించబడిన సొమ్మును యితర విషయములకై వినియోగించరాదు.

నిబంధన 70:—ఈ క్రింది రూపములలో సాంఘికభీమాకై ప్రత్యేకించబడిన సొమ్ము వినియోగించ బడుతుంది.

(అ) ఉచితవైద్య సహాయం:—సాధారణ రోగముల నివారణకై అగుఖర్చులన్నీ సాంఘికభీమా సొమ్మునుండి చేయబడతాయి. సాధారణ రోగములన్నింటికీ, పనికాలములోను, ఆపనివలనను వచ్చురోగములన్నింటికీ, ప్రమాదములన్నింటికీ సాంఘికభీమా సొమ్ము వినియోగించ బడుతుంది. కార్మికుల కుటుంబ సభ్యులుకూడ ఉచిత వైద్య సహాయమునుపొందుతారు

(ఆ) 'తాత్కాలిక దుర్బలత్వము' సంభవించిన వారికి రక్షణవుంటుంది. జబ్బు సమయము లోను, ప్రమాదము సంభవించి నప్పుడును ప్రసూతి సమయములోను, రోగిష్టి కుటుంబ సభ్యులకు ఉపచర్యచేయు సమయములోను, కార్మికుల

కివ్వబడు వేతనములకూడ పైరక్షణలో భాగమే. 'అనారోగ్య భృతి'గా రోగమువచ్చిన మొదటిరోజు నుండియు, రోగియొ త్తము వేతనమునకు సమానమైనమొత్తమివ్వబడుతుంది. ఎట్టి సమయములోనూ నిర్ణీత గరిష్ఠ మొత్తము నాభృతి మించరాదు. వృత్తిజనిత రోగములువచ్చి, పనిచేయుటకశక్తులగు వారికికూడ నిర్ణీతమైన భృతి యివ్వబడుతుంది.

(ఇ) 'నిరుద్యోగభృతి'—(1) కార్మిక సంఘ సభ్యులైన కార్మికులు ఒకసంవత్సరము పనిచేసిన తరువాతను, యితరకార్మికులు రెండు సంవత్సరములపని తరువాతను నిరుద్యోగభృతిని పొందుతారు.

(2) నిరుద్యోగులైన వ్యక్తులు పనిమార్పు కార్యాలయంలో గాని, 'కార్మికసంఘస్థానిక శాఖలోగాని తమపేర్లను నమోదుచేయించుకొన్నప్పుడును, తాము కూలికైపనిచేయు కార్మికులమనిగాని, కార్మిక సంఘసభ్యులమని గాని పత్రములనుచూపినప్పుడు మాత్రమే నిరుద్యోగ భృతిని పొందుతారు.

(3) నిరుద్యోగ భృతి యివ్వబడు కాలము, స్థానిక పరిస్థితులను సాంఘికభీమాసొమ్మును అనుగుణ్యంగా నిర్ణయించబడుతుంది.

(ఈ) 'అశక్తులకు, వృద్ధులకు యిచ్చుభృతి':—సాధారణ కారణములవలనగాని, ప్రమాదము వలనగాని, వృత్తిజనిత రోగములవలనగాని తాత్కాలికముగా గాని శాశ్వతముగాగాని అశక్తులైనా; లేకవృద్ధాప్యము చేత అశక్తులైనా అలసెంతవటుకు

అశక్తుడో, అతని కుటుంబ సభ్యులెంతమంది వున్నారో పరిశీలించుటకు ఏర్పాటు చేయబడు ప్రత్యేకసంఘమువారు వారివారి దరఖాస్తులను పరిశీలించి అంగీకరించగానే వారికిభృతి యివ్వబడుతుంది.

(ఉ) శిశుపోషణ వసతి:—ప్రతికార్మిక స్త్రీయును తన బిడ్డ కవసరమగు వస్తువులను తీసుకొనుటకుగాను పదినెలల పాటు అధికవసతిని పొందుతుంది. ఈఅధికవసతి మొత్తము మీద రెండు నెలల జీతమునకు మించరాదు.

(ఊ) దహన సంస్కార సౌకర్యం:—ఒక కార్మికుడు గాని, అతనికుటుంబ సభ్యుడుగాని చనిపోయినచో దహన సంస్కారాది కార్యములకుగాను భీమాకార్యాలయము వారు ధనరూపమైన వసతిని కలుగచేస్తారు.

(ఋ) కుటుంబము నంతను ఒకేకార్మికుడు పోషించుచున్నచో అతని మరణానంతరము అతని కుటుంబమునకు ప్రత్యేక సహాయము చేయబడుతుంది.

ఆసహాయము ఎంతవుండవలసినదీ, ఎంతకాలము చేయవలసినదీ ప్రత్యేకముగా నియమించబడిన సంఘమువారిచే ఆకుటుంబసభ్యుల సంఖ్యానుసరించి నిర్ణయింప బడుతుంది. ఈసహాయమును ఆరు నెలలకు పైగా పనిచేసిన ప్రతికార్మికుడూ పొందుతాడు.

షరా:—సాంఘిక భీమా నేర్పరుచు నంతవరకు ప్రస్తుత నిబంధనలోని వసతులన్నీ యజమానియే కలుగచేయాలి.

నిబంధన 71:—భీమా కార్యాలయ నిర్వాహణలోగాని భీమా ధనవినిమయములోగాని పాల్గొనుటకు యజమానికెట్టి హక్కూవుండదు. సాంఘిక భీమాకై యజమాని తనచందా ఇవ్వవలసి వుంటుంది. కార్మిక సంఘములచే నియమింపబడి, ప్రభుత్వముచే బలపరచబడి, కార్మిక మంత్రివర్గములచే నడువబడు సాంఘిక భీమా సంఘమునకే సాంఘిక భీమా ధనమును ప్రోగుచేసి వినియోగించు అధికారముంటుంది.

## 11 కార్మిక తగాదాల పరిష్కారమునకు, కార్మిక శాసనధిక్కార పరిష్కారమునకు పనిచేయు సంఘములు.

నిబంధన 72:—కార్మిక శాసన ధిక్కారమును, వుల్లంఘనలను, కార్మికులకు, పెట్టుబడి దారులకు వచ్చు తగాదాలను ప్రజా న్యాయస్థానము వారు విని అధికారయుతమైన ఆజ్ఞలతో తీర్పు చెప్పుతారు. లేక కార్మికుల, పెట్టుబడిదారుల ప్రతినిధులతో ఏర్పడు తగాదా పరిష్కారసంఘము వారిచే శాంతియుతముగాగాని, కార్మిక మంత్రివర్గమువారు నియమించిన మధ్యవర్తి సంఘనిర్ణయానుసారముగా గాని పరిష్కరింపబడతాయి.

నిబంధన 73:—కార్మిక శాసన, కార్మిక సమష్ఠ్యల సామూహిక ఒడంబడికల వుల్లంఘనలను కార్మిక న్యాయస్థానము వారే అంతకుముందు క్రిమినల్ లా ననుసరించి ఆకేసులో యెంత జరిమానా విధింపబడినప్పటికీ విచారిస్తారు.

# 12 ప్రకరణము.

నిబంధన 74:—ప్రస్తుత కార్మిక శాసనములోని సందిగ్ధము, వివాదగ్రస్తము అయిన విషయములలో కేంద్ర కార్మిక మంత్రివర్గము వారికే అంతిమ నిర్ణయాధికార మేుంటుంది. కేంద్ర సోవియట్ రాజ్యమునకు చేరియుండని సోవియట్ జిల్లాలలో జనించు పైవిధమగు వివాదములను పరిష్కరించు అంతిమాధికారము ఆయా రాష్ట్ర సోవియట్లకు చెంది యుంటుంది.

నిబంధన 75:—కేంద్ర సోవియట్ ప్రజా రాజ్యమునకు చేరియుండని జిల్లాలలోని ప్రభుత్వములు, కేంద్ర కార్మిక మంత్రివర్గముతో సమానముగా శాసనములు చేసి అమలు జరుపు సంపూర్ణాధికారములు కలిగియుంటాయి.

## కార్మిక శాసనము నమలు జరుపు సందర్భములో చైనా సోవియట్ ప్రజారాజ్యము [illegible] కేంద్ర కార్య నిర్వాహక వర్గము వారి నిర్ణయములు.

1. కార్మిక, కర్షక, సైనిక ప్రతినిధుల అఖిల చైనా సోవియట్ కాంగ్రెస్ చే ఆమోదింపబడిన కార్మిక శాసనము అమలు జరుప బడుతుంది.

2. కార్మిక శాసనము 1932 జనవరి ఒకటవ తేదినుండి అమలులోనికి వస్తుంది.

3. సోవియట్ కార్మిక శాసనము అమలులోనికి రాక పూర్వమున్న సమస్తకార్మిక చట్టములు, కార్మికసమస్యలపై చేయబడిన నిర్ణయములు రద్దుచేయ బడ్డాయి.

4. ప్రస్తుత కార్మిక శాసనము ప్రాతిపదికగా ప్రజా మంత్రుల సమితిగాని, కేంద్రకార్మిక మంత్రివర్గముగాని కార్మిక శాసనమును అభివృద్ధి పరుచుతూ ప్రత్యేక నిర్ణయముల ను, ఆజ్ఞలను, జారీచేయవచ్చును.

5. కార్మిక శాసనమునకు సవరణలుగాని, మార్పులు గాని సోవియట్ కేంద్రకార్య నిర్వాహక వర్గముచే ఆజ్ఞలరూ పములో జారీచేయబడతాయి.

6. చైనా సోవియట్ ప్రజారాజ్య మంతటా కార్మిక శాసనము అమలులోవుంటుంది.

7. కార్మిక శాసన ధిక్కారము గాని, యిక ముందు చేయబడు కార్మికులకు సంబంధించిన యే నిర్ణయ ధిక్కారముగాని, దారుణ నేరముగా పరిగణింపబడి శిక్షవి ధింపబడుతుంది.

మోసీడంగ్. (కేంద్రకార్య నిర్వాహక వర్గ అధ్యక్షుడు)
శానిక్, చాంగోటో. (ఉపాధ్యక్షులు).

---

S. V. Press, Cuddapah. T. P. No. 56/46.
C. 1000. 20-12-47.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B171 |
| పుస్తకం పేరు | సోవియట్ రష్యా చైనా రాజ్యాంగాలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 95 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |